of a scimitar; పద్మ=కమలము, A lotus, తీర్థ=తీర్థవిశేషము, name of a continent; ఓషధివిశేషయోః = ఓషధివిశేషము, A drug

అన్తర (మవకాశావధి పరిధానాన్తర్ధి భేద తాదర్థ్యే॥౩౮౨॥ ఛిద్రాత్మీయ వినా బహిర అవసరమధ్యేఽన్తరాత్మని చ)। అన్తరమ్॥న॥, అవకాశ = ఎడము, Intermediate time or space, అవధి=మర్యాద, Period; పరిధాన=కట్టుకోక, Clothing; అన్తర్ధి = మఱుఁగు, Concealment; భేద=విశేషము, Difference; తాదర్థ్యే = దానికొఱకు, Sake; ఛిద్ర = రంధ్రము, Hole; ఆత్మీయ=తనసంబంధమైనది, Own; వినా=అది వెలిగా, other than; బహిః=వెలుపట, Outside; అవసర = అవసరము, Opportune time; మధ్యే=మధ్యప్రదేశము, inside; అన్తరాత్మని=పరమాత్మ, Supreme soul, (చ) అన్యమైనది, Another.

(ముస్తేఽపి) పిఠరం పిఠరమ్॥న॥, ముస్తే=తుంగముస్తలు, Cyperus rotundus; (అపి) కుండ, A vessel, కవ్వపుకోల, A churning stick

(రాజికశేరుణ్యాపి) నాగరమ్॥ ౩౮౩॥ నాగరమ్॥న॥, రాజికశేరుణి=భద్రముస్తలు, Cyperus pertenuis, (అపి)సొంటి, Ginger; ॥త్రి॥నగరసంబంధమయినది, Belonging to a city.

శార్వరం(త్వన్ధతమసే ఘాతుకేభేద్య లిఙ్గకమ్)। శార్వరమ్॥న॥,అన్ధతమసే= ఘనమయినచీఁకటి, Very dark,॥త్రి॥ఘాతుకే=చంపుస్వభావముగలది, Destructive.

గౌరోఽ (రుణే సితే పీతే) గౌరః॥త్రి॥,అరుణే=ఎఱుపువస్తువునకును, Pale red; సితే=తెలుపువస్తువునకును, White; పీతే=పచ్చనివస్తువునకును పేరు, Yellow.

(వ్రణకార్యప్య)రుష్కరః॥ ౩౮౪॥ అరుష్కరః॥త్రి॥, వ్రణకారి = వ్రణమును చేయునది, Corrosive; (అపి) ॥పు॥ జీడిచెట్టు, Semicarpus Anacardium.

జఠరః (కఠినేఽపిస్యా) జఠరః॥త్రి॥ఇది, కఠినే = కఠినమయినవస్తువు,

Hard; (అపి)॥న॥కడుపు, The belly.

(దధస్తాదపి) చాధరః।

అధరః॥, అధస్తాత్ =దిగువనుండువస్తువు, Low, (అపి)॥త్రి॥హీనుఁడు, Inferior;॥పు॥పెదవి, The lip.

(అనాకులేఽపి) చైకాగ్ర్యో

ఏకాగ్రః॥త్రి॥, అనాకులే చ = కలఁకఁబారని, Unperplexed, (అపి)సావధానుఁడయిన, Attentive.

వ్యగ్రో (వ్యాసక్త ఆకులే)॥ ౩౮౫॥

వ్యగ్రః॥త్రి॥,వ్యాసక్తే=ఒకదానియందు మనస్సు తగిలిన, Eagerly occupied; ఆకులే=కలఁతపడిన, Distracted, perplexed.

(ఉపర్యుదీచ్య శ్రేష్ఠేష్వ) ప్యుత్తర (స్స్యాత్)

ఉత్తరః॥త్రి॥,ఉపరి=మీఁదికిని,Superior,high; ఉదీచ్య =ఉత్తరపుదిక్కునందుండుదానికిని, Northern, శ్రేష్ఠేషు=శ్రేష్ఠునికి, Excellent; (అపి) ప్రత్యుత్తరమునకును, An answer.

దనుత్తరః। (ఏషాం విపర్యయే శ్రేష్ఠే)

అనుత్తరః॥త్రి॥, ఏషామ్=వీనియొక్క, విపర్యయే=వ్యత్యాసమునందు అనఁగా మీఁదుగానిదానికిని, Low; ఉత్తరపు దిక్కునం దుండనిదానికిని, Southern, శ్రేష్ఠముగానిదానికిని, Worse; శ్రేష్ఠే=శ్రేష్ఠునికిని, Excellent; ప్రత్యుత్తరము లేనిదానికిని పేరు, Silent, unable to answer.

(దూరానాత్మోత్తమాః) పరాః ॥ ౩౮౬॥

పరః॥త్రి॥,దూర=దవ్వయినది, Distant;అనాత్మ-తనకంటె నన్యమయినది, Other; ఉత్తమాః=శ్రేష్ఠమయినది, Pre-eminent.

(స్వాదుప్రియౌ తు) మధురౌ

మధురః॥త్రి॥,స్వాదు = తియ్యనైనది, Sweet; ప్రియౌ=ఇష్టమయినది, Pleasing.

క్రూరౌ (కఠిన నిర్దయౌ)।

క్రూరః॥త్రి॥,కఠిన=కఠినమయినది, Hard; నిర్దయౌ=దయలేనివాఁడు, Cruel, pitiless.

ఉదారో (దాతృ మహతోః)

ఉదారః॥త్రి॥,దాతృ = దానముచేయువాఁడు, Generous; మహతోః=దొడ్డవాఁడు, Great.

ఇతర (స్త్వన్య నీచయోః)॥ ౩౮౭॥

ఇతరః॥త్రి॥,అన్య=పరుఁడు, Other; నీచయోః=నీచుఁడు, Low, vile.

(మన్దస్వచ్ఛన్దయోః)

స్వైరః॥త్రి॥,మన్ద=అలసుఁడు, Indolent;స్వచ్ఛ

న్దయోః=స్వతంత్రుఁడు, Independent, uncontrolled.

శుభ్రం (ముద్దీప్తశుక్లయోః)। శుభ్రమ్ ॥త్రి॥, ఉద్దీప్త=మిక్కిలి ప్రకాశించు, Splendid; శుక్లయోః=తెల్లని, White.

॥ ఇతిరాన్తాః ॥ ॥ రాన్తనానార్థక శబ్దములు ముగిసెను ॥

(చూడా కిరీటం కేశాశ్చ సంయతా) మౌలయ(స్త్రయః)। ౩౭౮॥ మౌలిః॥పు॥, చూడా=శిఖ, Lock of hair on the head; కిరీటమ్=కిరీటము, A diadem; సంయతాః కేశాశ్చ=ముడిచిన వెండ్రుకలు, Hair tied on the head.

(ద్రుమప్రభేద మాతఙ్గకాణ్డ పుష్పాణి) పీలవః। పీలుః ॥ పు ॥, ద్రుమప్రభేద = గోఁగుచెట్టు; మాతఙ్గ=ఏనుఁగు, An elephant, కాణ్డ=బాణము, Arrow, పుష్పాణి=పుష్పము, Flower.

(కృతాన్తానేహసోః) కాలః కాలః॥పు॥,కృతాన్త=యముఁడు, Yama; అనేహసోః=కాలము, Time.

(చతుర్థేఽపి యుగే) కలిః॥ ౩౭౯ ॥ కలిః॥పు॥, చతుర్థేయుగే=నాలవయుగము,The fourth age; (అపి) కలహము, Quarrel.

(స్యాత్కురఙ్గేఽపి) కమలః కమలః॥పు॥,కురఙ్గే=ఇఱ్ఱి, Deer; (అపి) ॥న॥ తామరపువ్వు, Lotus; నీళ్లు, Water, ॥స్త్రీ॥ లక్ష్మి.

(ప్రావారే ఽపిచ) కమ్బలః। కమ్బలః॥ పు॥, ప్రావారే=ఉత్తరీయము, (అపి) కంబళి, A blanket; గంగడోలు, Dewlap; సర్పవిశేషము, Chief of serpents.

(కరోపహారయోః పుంసి) బలిః (ప్రాణ్యఙ్గజే స్త్రియామ్)॥ ౩౮౦॥ బలిః॥పు॥,కర=అప్పనము,Tax;ఉపహారయోః=పూజోపకరణము, An oblation, ॥స్త్రీ॥ ప్రాణ్యఙ్గజే=జంతువుల యవయవములవలనఁ బుట్టినది, అనఁగా నొడలిమడుతలు, A wrinkle; బలిచక్రవర్తి, A giant.

(స్థౌల్య సామర్థ్య సైన్యేషు)బలం (నా కాక సీరిణోః)। బలమ్॥న॥, స్థౌల్య=బలుపు, Bulkiness ; సామర్థ్య=సత్తువ, Strength; సైన్యేషు=సేన, Army; ॥పు॥ కాక=కాకి,A crow; సీరిణోః=బలభద్రుఁడు.

వాతూలః (పుంసి వాత్యాయా మపి వాతాసహే త్రిషు)॥ ౩౫౧ ॥

వాతూలః॥పు॥, వాత్యాయామ్=వాయుసమూహము, Whirl-wind; ॥త్రి॥ వాతాసహే=గాలి సహింపనివాఁడు, Gouty; ఉన్మత్తుఁడు, Insane.

(భేద్యలిఙ్గశ్శఠే) వ్యాలః (పుంసిశ్వాపదసర్పయోః

వ్యాలః॥త్రి॥,శఠే=దుర్జనుఁడు,Wicked, ॥పు॥శ్వాపద=పులి, A tiger;సర్పయోః=పాము, A serpent.

మలో* (ఽస్త్రీపాప విట్కిట్టా) Filth; Excretion;

మలః॥పు॥,పాప=పాపము, Sin; విట్=విష్ఠ, కిట్టాని=వసాశుక్లాది ద్వాదశవిధము లయిన దేహమలములు, Dregs; చిట్టెము, Rust.

(న్యస్త్రీ)శూలం (రుగాయుధమ్)॥ ౩౫౨ ॥

శూలమ్॥పు॥, రుక్=శూలరోగము, Colic; ఆయుధమ్=ఆయుధము, A weapon.

(శఙ్కావపిద్వయోః) కీలః

కీలః॥పు॥,శఙ్కౌ=మేకు, A wedge,(అపి) అగ్నిజ్వాల, A flame; ॥ స్త్రీ॥ మోఁచేతిపోటు, A blow with the elbow.

పాలిః(స్త్ర్యశ్ర్యఙ్కపఙ్క్తిషు)।

పాలిః॥స్త్రీ॥,అశ్రి=అంచు, Edge; అఙ్క=చిహ్నము, A mark; పఙ్క్తిషు=పంక్తి, A row; ఇదిగాక మీసాలుగల స్త్రీ, A woman with a beard; ప్రస్థము, A measure of capacity; the hip.

కలా (శిల్పే కాలభేదేఽ)

కలా॥స్త్రీ॥, శిల్పే=చిత్తరువు మొదలయిన పనుల యందలి నేర్పు,A mechanical art;కాలభేదే=౫౪౦ రెప్పపాట్లుగల కాలము,A measure of time;(అపి) చంద్రునిలోపదియాఱవపాలు, A digit of the moon; విద్య, Skill; వడ్డి, Interest on capital, ''॥త్రి॥ అవ్యక్తమధురధ్వని"

* A low and inarticulate tone.

ప్యాలి (స్సఖ్యావలీఅపి)॥ ౩౫౩ ॥

ఆలిః(వ)ఆలీ॥స్త్రీ॥,సఖీ=చెలికత్తె,A companion; ఆవలీ=పంక్తి, A row; (అపి) కట్ట, A bridge.

(అబ్ధ్యమ్బువికృతౌ) వేలా (కాలమర్యాదయోరపి)।

వేలా॥స్త్రీ॥, అబ్ధ్యమ్బువికృతౌ=సముద్రజలవికారము అనఁగా సముద్రము పొంగుట,Tide;కాల=కార్యోచితకాలము,Time,మర్యాదయోః=మర్యాద, Limit;(అపి)చెలియలికట్ట, Sea shore; అనాయాస మరణమునకును పేరు, Easy and sudden death.

బహులాః (కృత్తికా గావో) బహులే (గ్నౌ శితౌత్రిషు)॥ ౩౫౪॥ బహులాః॥స్త్రీ, బ॥, కృత్తికా=కృత్తికానక్షత్రము, The pleiades, ॥స్త్రీ॥ గావః=గోవులు,(చ)ఏలకులు, ॥త్రి॥ నల్లనివస్తువు; ॥ పు ॥ అగ్ని; కృష్ణపక్షము, The dark fortnight.

లీలా (విలాసక్రియయోః) లీలా॥స్త్రీ॥, విలాస=స్త్రీలశృంగారచేష్ట, Gesture; క్రియయోః=క్రియ, Sport.

ఉపలా (శర్కరాఽపిచ)। ఉపలా ॥ స్త్రీ ॥, శర్కరా = మొరపమన్ను, Stony nodule; చక్కెర, Sugar; (అపి) ॥పు॥రత్నము, A gem; రాయి, A stone.

(శోణితేఽమ్భసి) కీలం కీలాలమ్॥న॥, శోణితే=నెత్తురు, Blood, అమ్భసి=నీళ్లు, Water.

మూల (మాద్యే శిఫా భయోః)॥ ౩౫౫॥ మూలమ్॥న॥, ఆద్యే=మొదలు, Origin; శిఫా=ఊడ, Root; భయోః=మూలనక్షత్రము, An asterism.

జాలం (సమూహ ఆనాయో గవాక్ష క్షారకా జాలమ్॥న॥,సమూహః=సమూహము, A multitude; ఆనాయః=వల, A net; గవాక్ష=కిటికీ, A window; క్షారకా = పసరుమొగ్గ, An unblown flower; (అపి) గారిడివిద్య, Magic; డంభము, Pride; జాలీ ॥ స్త్రీ ॥ పొట్లచెట్టు, Trichosanthes dioica.

శీల (స్వభావే సద్వృ శీలమ్॥న॥, స్వభావే=స్వభావము, Disposition; సద్వృత్తే=మంచినడత, Good conduct.

(సస్యే హేతుకృతే) ఫలమ్॥ ౩౫౬॥ ఫలమ్॥న॥,సస్యే= పైరు, Produce, fruit; హేతుకృతే = ప్రయోజనము, Consequence; బాణాగ్రము, Edge of a weapon; డాలు, Shield.

(ఛదిర్నేత్రరుజోః క్లీబం సమూహే) పటలం (వనా)। పటలమ్॥న॥, ఛదిః=ఇంటికప్పు, Roof; నేత్రరుజోః= నేత్రరోగము, Film over the eye; ॥స్త్రీ॥ సమూహే = సమూహము, Multitude.

(అధ స్స్వరూపయో తలమ్॥ ప్న ॥, అధః=క్రిందు, Bottom; స్వరూప

ర స్త్రీ) తలం | మోః=స్వరూపము, Essential charactei; హస్త కవచము, Leathern fence for the aim; అ అచేతికొట్టు, A slap with the hand.

(స్యాచ్చామిషే.) పలమ్॥ 3౫౭॥ | పలమ్॥న॥, ఆమిషే=మాంసము, Flesh, (చ) 3౨౦ గురిగింజలయెత్తు, A weight.

(ఔర్వానలేఽపి)పాతాలం | పాతాలమ్ ॥ న॥, ఔర్వానలే = బడబాగ్ని, Submaiine fire, (అపి) నాగలోకము, Infeinal regions.

చేలం (వస్త్రేఽధమే త్రిషు) । | చేలమ్॥న॥, వస్త్రే = వస్త్రము, Clothes;॥త్రి॥ అధమే=అధమమైనది, Infeiioi.

కుకూలం (శఙ్కుభిః కీర్ణే శ్వభ్రే) నా తు తుషానలే)॥ 3౫౮॥ | కుకూలమ్॥న॥, శఙ్కుభిః = మేకులచేత, కీర్ణే=నాటంబడిన, శ్వభ్రే=పల్లము, అనఁగా మేకులునాటిన గుంట, A ditch filled with stakes,॥ పు ॥ తుషానలే=కుమ్ము, A fiie made of chaff.

(నిర్ణీతే) కేవల (మితి త్రిలిఙ్గం త్వేక కృత్స్నయోః)। | కేవలమ్॥న॥,నిర్ణీతే=నిర్ణయింపఁబడినది,Absolute; (ఇతి) మాంతమగునవ్యయమనికొందఱు,॥పు॥ఏక=ఒకటి, Alone;కృత్స్నయోః=అంతయు,Entire,all.

(పర్యాప్తి క్షేమ పుణ్యేషు) కుశలం (శిక్షితే త్రిషు)॥ 3౫౯॥ | కుశలమ్॥న॥, పర్యాప్తి=సామర్థ్యము, Adequacy; క్షేమ=శుభము, Welfaie; పుణ్యేషు=పుణ్యము, Viitue; ॥ త్రి ॥ శిక్షితే = శిక్షింపఁబడినది, well-veised.

ప్రవాల(మఙ్కురేఽప్యస్త్రీ) | ప్రవాలమ్॥పు॥,అఙ్కురే=మొలక, A shoot, (అపి) చిగురు, Tender leaf; వీణాదండము, Neck of a lute; పగడము, Coial.

(త్రిషు) స్థూలం (జడేఽపిచ)। | స్థూలమ్॥త్రి॥,జడేచ= మందబుద్ధిగల, Stupid; (అపి) బలిసిన, Bulky.

కరాలో (దన్తురే తుఙ్గే) | కరాలః॥త్రి॥, దన్తురే = ఒడ్డుమిట్ట, Uneven; [ప]మిట్టపండ్లవాడు,having projecting teeth,తుఙ్గే =పొడవైనది,High;వెఱపుఁబుట్టించునది,Terrible.

(చారౌ దక్షేచ) పేశ లః॥ ౩౬౦ ॥ — పేశలః॥ త్రి॥, చారౌ = మనోహరమయినది, Beautiful, దక్షే=నేర్పరి, Expert.

(మూర్ఖే ఽర్భకే ఽపి) బాల(స్స్యాత్) — బాలః॥ త్రి॥, మూర్ఖే=మూర్ఖుఁడు, Ignorant; అర్భకే=చిన్నవాఁడు, Young; (అపి)॥న॥ కురువేరు, Andropogon Schoenanthoeus;॥పు॥ పుచ్ఛము, Tail, కేశము, Hair.

లోల (శ్చల సతృష్ణ యోః। — లోలః॥ త్రి॥, చల = కదలునది, Tremulous; సతృష్ణయోః=ఆశగలది, Eager for.

ఇతి లాన్తాః. — లాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

దవదావౌ (వనారణ్య వహ్నౌ) — దవః-దావః॥పు॥౨,వన=అడవి, Forest; అరణ్యవహ్నౌ=కారుచిచ్చు, Forest conflagration.

(జన్మహరౌ) భవౌ ॥ ౩౬౧॥ — భవః॥పు॥, జన్మ=పుట్టుక, Birth; హరౌ=శివుడు; మరియు సంసారము, Worldly life.

(మన్త్రిసహాయ)స్సచివౌ — సచివః॥పు॥,మన్త్రి = మంత్రి, A counsellor; సహాయః=తోడైయుండువాఁడు, A companion.

(పతి శాఖి నరా) ధవాః। — ధవః॥పు॥, పతి = పెనిమిటి, A husband, [ప] ఏలువాఁడు, A master; శాఖి = చండ్రచెట్టు, Lythrum fruticosum; నరాః = మనుష్యుఁడు, A man.

అవయః (శైల మే షార్కాః) — అవిః॥పు॥,శైల=పర్వతము, A mountain;మేష=గొఱ్ఱె, A sheep; అర్కాః=సూర్యుఁడు.

(ఆజ్ఞాఽఽహ్వానాధ్వరా) హవాః॥ ౩౬౨॥ — హవః॥పు॥, ఆజ్ఞా=ఆజ్ఞ, Command; ఆహ్వాన=పిలుచుట, Call; అధ్వరాః=యజ్ఞము, Sacrifice.

భావ (స్సత్తా స్వభావాభిప్రాయ చేష్టాఽఽత్మ జన్మసు)। — భావః॥పు॥,సత్తా= ద్రవ్యాదులకలిమి, State of being; స్వభావ=స్వభావము, Disposition; అభిప్రాయ=అభిప్రాయము Intention; చేష్టా= ధాతువాచ్యక్రియ, Gesture; ఆత్మ, Soul; జన్మ=పుట్టుక, Birth; మరియు మనోవికారము, Abstract idea; శబ్దప్రవృత్తినిమిత్తము, Purport.

(స్యాదుత్పాదేఫలేపుష్పే) ప్రసవో (గర్భమోచనే)॥ 3౬౩॥ | ప్రసవః॥పు॥, ఉత్పాదే=పుట్టుక, Production; ఫలే=ఫలము, Fruit, పుష్పే=పుష్పము, Blossom, గర్భమోచనే=ప్రసూతి, Bringing forth.

(అవిశ్వాసేఽపహ్నవే ఽపి నికృతావపి) నిహ్నవః। | నిహ్నవః॥పు॥, అవిశ్వాసే=అవిశ్వాసము, Distrust, అపహ్నవే=దాఁచుట, Concealment, నికృతౌ = తిరస్కరించుట, Denial, (అపి) కపటము, Wickedness.

(ఉత్సేకామర్షయో రిచ్ఛాప్రసవేమహః) ఉత్సవః॥ 3౬౪॥ | ఉత్సవః॥పు॥, ఉత్సేక=ఉప్పొంగుట, Elevation; అమర్షయోః = కోపము, Impatience, ఇచ్ఛాప్రసవే=ఇచ్ఛపుట్టుట, Rising of a wish; మహః= పండుగ, Festival

అనుభావః ( ప్రభావే చ సతాంచ మతినిశ్చయే)। | అనుభావః॥పు॥, ప్రభావే=ప్రభావము, Dignity; సతామ్=పెద్దలయొక్క, మతినిశ్చయే=బుద్ధినిశ్చయము, Firm opinion, (చ)సాత్త్వికాదిభావమును గుఱించిన భ్రూవిక్షేపాదులు, Indication of a feeling.

(స్యాజ్జన్మహేతుః) ప్రభవః(స్థానంచాద్యోపలబ్ధయే)॥ 3౬౫॥ | ప్రభవః॥పు॥, జన్మహేతుః=జననమునకు కారణమయినది, Generative cause, origin; ఆద్యోపలబ్ధయే= మొదటఎఱుంగుటకు, స్థానంచ=స్థానమయినది, Place where a thing is first perceived; Source, (చ)పరాక్రమము, Strength

(శూద్రాయాంవిప్రతనయే శస్త్రే)పారశవః (పుమాన్)॥ | పారశవః ॥ పు॥, శూద్రాయాంవిప్రతనయే= శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలనఁ బుట్టినకుమారుఁడు, One born of a brahman in a sudra woman; శస్త్రే=ఆయుధము, Battle-axe.

ధ్రువో( భభేదేక్లీబే తు నిశ్చితే శాశ్వతే త్రిషు) । | ధ్రువః॥పు॥, భభేదే=ధ్రువనక్షత్రము, The polar star ; ॥న॥ నిశ్చితే = నిశ్చయింపఁబడినది, Certainty; ॥త్రి॥ శాశ్వతే=నిత్యమయినది, Perpetual, immovable

స్వో ... ని | స్వః॥పు॥, జ్ఞాతౌ=జ్ఞాతి, A kinsman, ॥న॥ ఆ

స్వం త్రిష్వాత్మనే స్వోऽస్త్రియాం ధనే)॥ — స్వస్త్రి

త్ర్వని=ఆత్మ, The soul; ॥త్రి॥ ఆత్మయే=తనసంబంధమైనది, Own, ॥స్న॥ ధనము, Wealth

(స్త్రీకటీవస్త్రబన్ధేऽపి) నీవీ(పరిపణేऽపిచ)

నీవీ॥స్త్రీ॥, స్త్రీకటీవస్త్రబన్ధే = స్త్రీలకటిప్రదేశమందలి పోఁకముడి, The knot of a woman's wearing garment; పరిపణేచ = మొదటిసొమ్ము, Principal; (అపి) పందెముగట్టిన ద్రవ్యము, A stake at play.

శివా(గౌరీఫేరవయోః)

శివా॥స్త్రీ॥, గౌరీ=గౌరీదేవి, ఫేరవయోః=నక్క, A jackal; కరకచెట్టు, ఉసిరికచెట్టు, Myrobalan, ॥పు॥శివుఁడు, ॥న॥ శుభము, Auspiciousness.

ద్వన్ద్వం (కలహయుగ్మయోః)॥ ౩౬౭॥

ద్వన్ద్వమ్॥న॥, కలహ = యుద్ధము, Quarrel; యుగ్మయోః=రెండు, A pair, మిథునము, Union of the sexes.

(ద్రవ్యాసు వ్యవసాయేషు) సత్త్వ (మస్త్రీతు జన్తుషు)।

సత్త్వమ్॥న॥, ద్రవ్య = పృథివ్యాదిద్రవ్యములు, Substance, అసు=ప్రాణము, Vitality, వ్యవసాయేషు=ఉద్యోగము, Vigour;॥స్న॥ జన్తుషు=జంతువు, An animal.

క్లీబం(నపుంసకం షణ్ఢే వాచ్యలిఙ్గమవిక్రమే)॥ ౩౬౮॥

క్లీబమ్॥న॥, షణ్ఢే=నపుంసకుఁడు, A eunuch, ॥త్రి॥ అవిక్రమే = పరాక్రమహీనుఁడు, Weak; నపుంసకమ్, Neuter gender.

※ ఇతి వాన్తాః. ※

※వాన్త నానార్థకశబ్దములు ముగిసెను.※

(ద్వౌ) విశౌ వైశ్యమనుజౌ)

విట్॥శ్,పు॥,వైశ్య=వైశ్యుఁడు,A man of the commercial tribe;మనుజౌ=మనుష్యుఁడు,a man.

(ద్వౌచారాభిమరౌ) స్పశౌ। Conflict with a dangerous animal.

స్పశః॥పు॥, చార=వేగులవాఁడు, A spy, అభిమరౌ=యుద్ధము, War; [ప] క్రూరమృగములతో పోట్లాట.

(ద్వౌ) రాశీ పుఞ్జమేషాద్యౌ)

రాశిః॥పు॥, పుఞ్జ=ప్రోగు, A heap; మేషాద్యౌ=మేషాదిరాసులు, A sign of the zodiac.

(ద్వౌ) వంశౌ (కులమ

వంశః॥పు॥, కుల = కులము, Family; మస్క

స్యా-శా)॥ ३६ఽ॥ శా=వెదురు, A bamboo.

(రహః ప్రకాశౌ) నికా శా | నికాశః॥పు॥, రహః=ఏకాంతస్థలము, Solitude; ప్రకాశౌ=స్పష్టమైనది, Display.

నిర్వేశో (భృతి భోగ యోః), | నిర్వేశః॥ పు॥, భృతి = కూలి, Wages, భోగయోః = భోగము, Enjoyment.

(కృతాన్తే పుంసి) కీనాశః (క్షుద్ర కర్షకయోః స్త్రిషు)॥ ३२०॥ కీనాశః॥పు॥, కృతాన్తే=యముడు, ॥త్రి॥క్షుద్ర=దరిద్రుడు, Niggardly; కర్షకయోః=దున్నువాఁడు, Cultivator.

(పదే లక్ష్యే నిమిత్తే) ఉపదేశ | అపదేశః॥పు॥, పదే=స్థానము, A place; లక్ష్యే=వ్యాజము, Pretext, [ప] గుఱి, A butt; నిమిత్తే=నిమిత్తము, A cause; ప్రసిద్ధి, Fame.

(స్యాత్) తృణ... వుంచ)। | ... Water; (చ) దర్భ. Sacrificial grass

దశా (ఉవస్థాఽనేకవిధాఽ) | దశా॥స్త్రీ॥, అనేకవిధా = అనేకవిధములయిన, అవస్థా=బాల్యము మొదలయిన యవస్థలు, Age; (అపి) వత్తి, Wick; కోకబట్ట, Edge of cloth.

వ్యాశా (తృష్ణాఽపిచాయతా)॥ ३२१॥ ఆశా॥స్త్రీ॥, ఆయతా=అధికమయిన, తృష్ణా= అపేక్ష, Desire, (అపి) దిక్కు, quarter.

వశా (స్త్రీకరిణీవన్ధ్యా) | వశా॥స్త్రీ॥, స్త్రీ, A woman; కరిణీ=ఆఁడుఏనుఁగు, A female elephant, వన్ధ్యా = గొడ్డుటావు, A barren cow; ॥త్రి॥అధీనమైనది, Dependent.

దృగ్ (జ్ఞానే జ్ఞాతరి త్రిషు)। | దృక్॥శ్,స్త్రీ॥,జ్ఞానము, Knowledge, ॥త్రి॥జ్ఞాతరి = ఎఱుఁగువాఁడు, One who knows or sees; నేత్రము, An eye, ॥ స్త్రీ॥ చూపు, Sight; చూచువానికి పేరైనపుడు॥త్రి॥.

(స్యా)త్కర్కశ (స్సాహసికః కఠోరామసృణావపి)॥ ३२२॥ కర్కశః॥త్రి॥, సాహసికః = సాహసముగలవాఁడు, Violent; కఠోర= గట్టియైనది, Hard, అమసృణౌ= పరుసనిది, Intangible; (అపి) దయలేనివాఁడు, Unmerciful.

| | |
|---|---|
| ప్రకాశో (ఒతిప్రసిద్ధే ఒపి) | ప్రకాశః॥త్రి॥, అతిప్రసిద్ధే=మిక్కిలిప్రసిద్ధము యినది, Famous; (అపి)॥పు॥ఎండ, Light. |
| (శిశావజ్ఞేఒపి) బాలిశః। | బాలిశః॥త్రి॥,శిశౌ=పిన్నవాఁడు, Young; అజ్ఞే= ఎఱుకలేనివాఁడు, Ignorant; (అపి) మూర్ఖుఁడు. |
| (నృశంసఖడ్గౌ)నిస్త్రింశౌ | నిస్త్రింశః॥త్రి॥, నృశంస = హింసించువాఁడు, Cruel, ॥పు॥ ఖడ్గౌ=కత్తి, A sword. |
| పాశో (బన్ధన శస్త్రయోః)॥ 323॥ | పాశః॥పు॥, బంధన = త్రాడు, A rope; శస్త్రయోః=ఆయుధము, A weapon. |
| కోశో (ఒస్త్రీ కుడ్మలే ఖడ్గపిధానేఒర్థౌఘదివ్యయోః)॥ | కోశః॥న్న॥, కుడ్మలే = మొగ్గ, A bud; ఖడ్గపిధానే=కత్తియొఱ, Scabbard; అర్థౌఘ = ధన సమూహము, Treasure; దివ్యయోః = దివ్యప్రమాణభేదము, an oath. |
| ॥ ఇతి శాన్తాః ॥ | ॥ శాన్త నానార్థకశబ్దములు ముగిసెను ॥ |
| (సురమత్స్యా)వనిమిషౌ | అనిమిషః॥పు॥, సుర=దేవత, A god; మత్స్యౌ=మత్స్యము, A fish. |
| పురుషా(వాత్మమానవౌ) | పురుషః॥పు॥, ఆత్మ=ఆత్మ, The soul; మానవౌ=మనుష్యుఁడు. |
| (కాకమత్స్యాశిఖగౌ) ధ్వాఙ్క్షౌ | ధ్వాఙ్క్షః॥పు॥, కాక = కాకి, A crow; మత్స్యాశి=మత్స్యములనుదిను, ఖగౌ = కొక్కెర పక్షి, Any bird which preys on fish |
| కక్షౌ(చ తృణవీరుధౌ)। | కక్షః॥పు॥, తృణ=కసవు, Grass; వీరుధౌ= తీఁగెపొద, A climbing plant; (చ) చంక, The arm-pit, ఎండినయడవి, A forest of dead trees; ॥న॥పాపము, Sin. |
| అభీషుః (ప్రగ్రహే రశ్మౌ) | అభీషుః॥పు॥, ప్రగ్రహే=పగ్గము,A rein; రశ్మౌ= కిరణము, A ray of light. |
| ప్రైషః (ప్రేషణ మర్దనే)। | ప్రైషః॥పు॥,ప్రేషణ=అంపుటకును,Despatch; మర్దనే=పీడించుటకును, Paining. Fatigue. |
| పక్షః(సహాయే) | పక్షః॥ పు॥, సహాయే=సహాయము, Partisan; (అపి) శుక్లకృష్ణపక్షములు, Fortnight; ఱెక్క, |

| |
|---|
| | Wing; పార్శ్వము, Side. |
| ఉష్ణీష (శ్శిరోవేష్ట కిరీటయోః)॥ 32౫॥ | ఉష్ణీషః॥పు॥, శిరోవేష్టే= తలకుచుట్టెడు పాగా మొదలయినవానికిని, A turban; కిరీటయోః=కిరీట మునకును పేరు, A diadem. |
| (శుక్రలే మూషికే శ్రేష్ఠే సుకృతే వృషభే) వృషః। | వృషః ॥పు॥, శుక్రలే = వీర్యవృద్ధి గలవాఁడు, Lustful; మూషికే= ఎలుక, A rat; శ్రేష్ఠే=శ్రేష్ఠుఁడు, Pre-eminent; సుకృతే=పుణ్యము, Virtue; వృషభే=వృషభము, A bull. |
| (ద్యూతేఽక్షే శారిఫలకేఽ)ప్యాకర్షో | ఆకర్షః ॥ పు॥, ద్యూతే = జూదము, Gaming with dice; అక్షే= పాచికలు, A die; శారిఫలకే= జూదమాడు పలక, A board for playing; (అపి) ఆకర్షించుట, Attraction. |
| ఽథాక్ష(మిన్ద్రియే) 32౬॥ (నా ద్యూతాఙ్గే కర్షచక్రే, వ్యవహారే కలిద్రుమే)। | అక్షమ్ ॥ న ॥, ఇన్ద్రియే = ఇంద్రియము, An organ of sense; ॥పు॥ద్యూతాఙ్గే=పాచికలు, A die; కర్షే = ఎనుబదిగురిగింజలయెత్తుగలది, A measure; చక్రే=బండికన్ను, A wheel; వ్యవహారే = వ్యవహారము, A lawsuit; కలిద్రుమే=తాండ్రచెట్టు, The belleric myrobalan. |
| కర్షూ (ర్వార్తా కరీషాగ్నిః)కర్షూః(కుల్యాభిధాయినీ)॥ 322॥ | కర్షూః॥పు॥, వార్తా=కృషి, Agriculture; కరీషాగ్నిః = పిడకనిప్పు, Fire with cowdung; ॥స్త్రీ॥ కుల్యాభిధాయినీ=నది, A river. |
| (పుంభావే తత్క్రియాయాంచ) పౌరుషం | పౌరుషమ్॥న॥,పుంభావే=మగతనము, Virility తత్క్రియాయామ్=పురుషుఁడుచేయుపని, Manly act; (చ) మానిసిచేయెత్తుపొడవు, The height of a man's stature. |
| విష (మప్సుచ)। | విషమ్॥న॥, అప్సు=నీళ్లు, Water; (చ)విషము Poison. |
| (ఉపదానే) ఽప్యామిషం (స్యాత్) | ఆమిషమ్॥న్న॥, ఉపదానే=కానుక, A bribe on Offering; (అపి) మాంసము, Flesh. |

(అపరాధేఽపి) కిల్బిష 3౨౮॥ — కిల్బిషమ్॥న॥, అపరాధే = అపరాధమునకును, An offence, (అపి) పాపమునకును పేరు, Sin

(స్యాద్వృష్టౌ లోకధాత్వంశే వత్సరే) వర్ష (మస్త్రియామ్) — వర్షమ్॥ప్న॥, వృష్టౌ = వాన, Rain; లోకధాత్వంశే=భారతవర్షము మొదలయిన భూఖండము, A continent; వత్సరే=సంవత్సరము, A year, 'లోకధాత్వ్యంశే' అని పాఠాంతరము.

ప్రేక్షా (నృత్తేక్షణం ప్రజ్ఞా) — ప్రేక్షా॥స్త్రీ॥, నృత్త=నాట్యము, Dancing, ఈక్షణ=చూచుట, View; ప్రజ్ఞా=బుద్ధి, Intellect

భిక్షా (సేవాఽర్థనా భృతిః)॥ 3౨౯॥ — భిక్షా॥స్త్రీ॥, సేవా=సేవించుట, Service; అర్థనా=అడుగుట, Begging; భృతిః=కూలి, Wages.

త్విట్ (శోభాఽపి) — త్విట్॥ష్,స్త్రీ॥, శోభా = కాంతి, Splendour; (అపి) దీప్తి, A ray of light.

(త్రిషు పరే) — తక్కినషాంతములన్నియు॥త్రి॥

న్యక్షం (కార్త్స్న్యే నికృష్టయోః)। — న్యక్షమ్॥త్రి॥, కార్త్స్న్యే=అంతయుననుటకును, Entire; నికృష్టయోః=అధమునకును, Inferior.

(ప్రత్యక్షేఽధికృతే) ఽధ్యక్షో — అధ్యక్షః॥త్రి॥, ప్రత్యక్షే=సాక్షాత్తుగా నెఱుఁగంబడునది, Perceptible; అధికృతే=గ్రామాదులకు నధికారియైనవాఁడు, Superintendent.

రూక్ష (స్త్వప్రేమ్ణ్యచిక్కణే)॥ 3౩౦॥ — రూక్షః॥త్రి॥, అప్రేమ్ణి = ప్రేమ లేనిది, Unfriendly; అచిక్కణే=పరుసనిది, Rough.

ఇతిషాన్తాః. — షాంతనానార్థక శబ్దములు ముగిసెను.

(రవి శ్వేతచ్ఛదౌ హంసౌ) — హంసః॥పు॥, రవి=సూర్యుఁడు, శ్వేతచ్ఛదౌ=హంస, Swan, మఱియు లోభము లేని రాజు, An unambitious king; విష్ణువు; అంతరాత్మ, The soul; *మత్సరము లేనివాఁడు, ఉత్తమసన్న్యాసి, An ascetic; ఉత్తరపదమయినపుడు శ్రేష్ఠుఁడు.

*One free from malice.

(సూర్యవహ్నీ) విభావసూ। — విభావసుః॥పు॥, సూర్యే = సూర్యునికిని, The sun; వహ్నౌ=అగ్నికిని పేరు, Fire.

వత్సౌ (తర్ణక వర్షౌ — వత్సః॥పు॥, తర్ణక=దూడకును, A calf; వర్షౌ

| | |
|---|---|
| ద్వా) | సంవత్సరమునకును పేరు, A year. |
| (సారఙ్గాశ్చ) దివౌకసః॥ ౩౭౧॥ | దివౌకాః॥ స, పు॥, దేవతలు, A god; సారఙ్గాః=చాతకపక్షులు, Cuculus; (చ)పక్షి,A bird. |
| (శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే) రసః। | రసః॥పు॥, శృఙ్గారాదౌ = శృంగారాదిరసము, Sentiment, విషే=విషము, Poison, నీళ్లు, Water; వీర్యే=బలము,Virility; పాదరసము, Quick-silver; గుణే=మధురాదిషడ్రసములు, Taste; రాగే=అనురాగము,Zeal; ద్రవే=ఆర్ద్రమైనది, liquid, పుల్లనీళ్లు. |
| (పుం)స్యుత్తంసావతంసౌ (ద్వౌ కర్ణపూరేఽపి శేఖరే)॥ ౩౭౨॥ | ఉత్తంసః-అవతంసః॥ప్ర॥ ౨, కర్ణపూరే=చెవులం బెట్టుపువ్వులు సొమ్ములు మొదలయినవి, An ear-ring; శేఖరే=కిరీటాదిశిరోభూషణములు, A crest. |
| (దేవభేదేఽనలే రశ్మౌ) వసూ(రత్నే ధనే) వసుః। | వసుః॥పు॥, దేవభేదే=అష్టవసువులు, A class of deities;అనలే=అగ్ని, Fire, రశ్మౌ=కిరణము, A ray of light; ॥న॥ రత్నే=రత్నము, A gem; ధనే ధనము, Wealth. |
| (విష్ణౌ చ) వేధాః | వేధాః॥స,పు॥, విష్ణౌ=విష్ణువునకును,(చ)బ్రహ్మకును, విద్వాంసునికిని పేరు. |
| (స్త్రీ) త్వాశీః (హితాఽశంసాఽహిదంష్ట్రయోః)॥ ౩౭౩॥ | ఆశీః॥స, స్త్రీ॥, హితాఽశంసా=హితమయిన వస్తువు కావలెననుట, Benediction; అహిదంష్ట్రయోః=పాముకోఱ, Fang of a serpent. |
| లాలసే (ప్రార్థనౌత్సుక్యే) | లాలసః॥ప్ర॥, ప్రార్థన = వేఁడుకోలు, Request; ఔత్సుక్యే=ఇష్టవస్తు వెప్పుడు కలుగునను రాగవిశేషము, Eagerness; ॥త్రి॥ విషయాసక్తుఁడు, Taking pleasure in. |
| హింసా (చౌర్యాదికర్మ చ) | హింసా॥ స్త్రీ॥, చౌర్యాదికర్మ=దొంగతనము కొట్టుట కట్టుట మొదలయినవి, Mischief, as robbery &c.; (చ) చంపుట, Slaughter. |
| ప్రసూ (రశ్వాపి) | ప్రసూః॥ స్త్రీ॥, అశ్వా=ఆఁడుగుఱ్ఱము, A mare; |

( భూద్యావా ) రోద స్యౌ — రోదసీ॥సీ॥, భూ=భూమి, The earth; ద్యావా=ఆకాశము, The sky.

రోదసీ(చ తే)॥ 3౭౪॥ — రోదః॥స్,న॥, తే=ఆభూమికిని ఆయాకాశమున కును పేరు, The earth and sky.

(జ్వాలా భాసోర్న పుం) స్యర్చిః — అర్చిః॥స్, స్త్రీ॥, జ్వాలా=మంటకును, Flame, భాసోః=కాంతికిని పేరు, Light.

జ్యోతి (ర్భ ద్యోత దృ ష్టిషు) । — జ్యోతిః॥స్,న॥, భ=నక్షత్రము, A star; ద్యోత=తేజస్సు, Light; దృష్టిషు = దృష్టి, Pupil of the eye. ॥పు॥ సూర్యుఁడు, అగ్ని.

( పాపాపరాధయో ) రాగః — ఆగః॥స్,న॥, పాప = పాపము, Sin; అపరాధయోః=అపరాధము, An offence.

(ఖగబాల్యాదినో) ర్వ యః॥ 3౭౫॥ — వయః॥స్, న॥, ఖగ=పక్షి, A bird; బాల్యాదినోః=బాల్య యౌవనాది వయస్సు, Age.

( తేజఃపురీషయో) ర్వ ర్చో — వర్చః॥స్,న॥, తేజః = తేజస్సు, Splendour; పురీషయోః=విష్ఠ, Ordure.

మహ (స్తూత్సవ తేజ సోః) । — మహః॥స్, న॥, ఉత్సవ=పండుగ, Festival; తేజసోః= తేజస్సు, Light.

రజో (గుణేఽపి స్త్రీపు ష్పే) — రజః॥స్, న॥, గుణే=రజోగుణము, Quality of passion; స్త్రీపుష్పే=స్త్రీలముట్టు రక్తము, Woman's menses,(అపి)ధూళి,Dust,పుప్పొడి,Pollen.

(రాహౌ ధ్వా తమః॥ 3౭౬॥ — తమః॥స్, న॥, రాహౌ = రాహువు, Moon's ascending node; ధ్వాన్తే=చీఁకటి, Darkness; గుణే=తమోగుణము, Illusion.

ఛన్దః (పద్యే ఽభిలా షే చ) — ఛన్దః॥స్,న॥, పద్యే = గాయత్రి మొదలయిన ఛందస్సు, Poetical metre; అభిలాషే=ఇచ్ఛ, Desire; uncontrolled conduct; (చ)వేదము.ఇచ్ఛకు పేరయినపుడు అకారాంత పుంలింగముంగలదు.

తపః(కృచ్ఛ్రాదికర్మ చ) । — తపః॥ స్, న॥, కృచ్ఛ్రాదికర్మ = కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలయిన తపస్సులు, Aus-

terity; (చ) ధర్మము, Virtue; ॥పు॥ శిశిరఋతువు, మాఘమాసము.

సహో (బలం) సహా (మార్గో)
సహః॥స్, న॥, బలమ్=బలిమి, Strength; ॥పు॥ మార్గః=మార్గశీర్ష మాసము, Winter.

నభః (ఖం శ్రావణో) నభాః॥ 30౭౭॥
నభః॥స్,న॥, ఖమ్=ఆకాశము, The sky; ॥పు॥ శ్రావణః=శ్రావణమాసము, A month.

ఓక (స్సద్మాశ్రయ శ్చౌ) కాః
ఓకః॥స్,న॥ [ప]॥అ,పు॥సద్మ=ఇల్లు, A house; ఆశ్రయః=తావు, An asylum, (చ)పక్షి, A bird.

పయః (క్షీరం పయో ఽమ్బు చ)।
పయః॥ స్,న॥, క్షీరమ్=పాలు, Milk; అమ్బు చ=నీళ్లు, Water.

ఓజో (దీప్తౌ బలే)
ఓజః॥ స్, న॥, దీప్తౌ=తేజస్సు, Splendour, బలే=బలిమి, Strength.

స్రోత(ఇన్ద్రియే నిమ్నగారయే)॥ 30౭౮॥
స్రోతః॥ స్,న॥, ఇన్ద్రియే=శ్రోత్రాదీంద్రియములు, Organ of sense; నిమ్నగారయే=నదీవేగము, Stream of a river.

తేజః (ప్రభావే దీప్తౌ చ బలే శుక్రే)
తేజః॥ స్,న॥, ప్రభావే=ప్రభావము, Dignity; దీప్తౌ చ = కాంతి, Splendour, బలే = బలిమి, Strength; శుక్రే=రేతస్సు, Semen virile; (అపి) తిరస్కారము నోర్వకుండుట, Strength of character, not bearing insult with impunity.

(ఉప్యత స్త్రిషు).
ఇదిమొదలు సాంతములన్నియు ॥ త్రి ॥ స్త్రీలింగవివక్షయందు బీభత్సశబ్దముతప్ప కడమశబ్దములు ఈకారాంతములౌను.

విద్వా(న్విదంశ్చ)
విద్వాన్॥ స్, త్రి॥, విదన్ = ఎఱుకగలవానికిని, Intelligent; (చ) ఆత్మజ్ఞునికిని, Having a true knowledge of the soul; విద్వాంసునికిని, Learned.

బీభత్సో (హింస్రో)
బీభత్సః॥త్రి॥, హింస్రః=చంపుస్వభావముగలవాఁడు, Cruel; (అపి) రోఁతగలది, Envious; అర్జునుఁడు, Arjuna.

(ఉప్యతిశయే త్వమీ)॥
ముందరఁజెప్పంబడు జ్యాయశ్శబ్దము మొద

| | |
|---|---|
| | లై నవి ఠను స్వార్థాతిశయార్థమందు వర్తించును. |
| (వృద్ధ ప్రశస్యయోః) జ్యాయాన్ | జ్యాయాన్॥స,త్రి॥, వృద్ధ=మిక్కిలిముద్ధుఁడు, Very old, ప్రశస్యయోః = మిక్కిలిశ్రేష్ఠుఁడు, Very excellent |
| కనీయాం (స్తుయువాల్పయోః)। | కనీయాన్॥ స,త్రి॥, యువా=మిక్కిలిప్రాయపువాఁడు, Very young, అల్పయోః = మిక్కిలియల్పుఁడు, Very small |
| వరీయాం (స్తూరువరయోః) | వరీయాన్॥స,త్రి॥,ఉరు=మిక్కిలిఘనుఁడు,Very great,వరయోః మిక్కిలిశ్రేష్ఠుఁడు,Very excellent. |
| సాధీయాన్ (సాధుబాఢయోః)॥ ౩౯౦॥ | సాధీయాన్॥స, త్రి॥, సాధు=మిక్కిలి మంచివాఁడు, Very right; బాఢయోః = మిక్కిలిదృఢమైనవాఁడు, Very firm. |
| ॥ ఇతిసాన్తాః ॥ | ॥ సాన్తనానార్థకశబ్దములు ముగిసెను ॥ |
| (దలేఽపి) బర్హం | బర్హమ్॥ న॥, దలే=ఆకు, A leaf, (అపి) పరివారము, Retinue, నెమిలిపురి, A peacock's tail. |
| (నిర్బన్ధోపరాగార్కాదయో) గ్రహః। | గ్రహః॥పు॥, నిర్బన్ధ = గ్రహణము, Seizure; ఉపరాగ=చంద్రసూర్యగ్రహణము, An eclipse, అర్కాదయః = సూర్యుఁడుమొదలుగాఁగల నవగ్రహములు, A planet |
| (ద్వార్యాపీడే క్వాథరసే ) నిర్వ్యూహో (నాగదన్తకే)॥ ౩౯౧॥ | నిర్వ్యూహః॥పు॥, ద్వారి=వాకిలి, A door; ఆపీడే = సిగనుజుట్టిన పూలదండ, A chaplet; నాగదన్తకే = కొణిగకు నాధారముగా గోడనునాటినకొయ్య, Wood jutting out of a hall; క్వాథరసే=కషాయము, Extracted juice |
| (తులాసూత్రేఽశ్వాదిరశ్మౌ)ప్రగ్రాహః ప్రగ్రహో(ఽపిచ)। | ప్రగ్రాహః-ప్రగ్రహః॥పు॥ ౨, తులాసూత్రే=త్రాసుకోల మొదలైనవానిత్రాటికిని, The string suspending a balance, అశ్వాదిరశ్మౌ= గుఱ్ఱము మొదలుగాఁగలవానిని గట్టు పగ్గము మొదలయినవానికిని పేళ్లు, Halter for horses. |

| | |
|---|---|
| (పత్నీ పరిజనాదా నమూల శాపాః)పరిగ్రహాః॥ 36—2॥ | పరిగ్రహాః॥ పు॥, పత్నీ = పెండ్లము, A wife; Family; పరిజన=పరివారము, Dependent; ఆదాన=పుచ్చుకొనుట, Acceptance; మూల = మొదలు, Origin, root; శాపాః=శపథము, Oath. |
| (దారేష్వపి) గృహాః | గృహాః॥ పు, నిత్యబ॥, దారేషు = పెండ్లము, Wife, (అపి)॥న॥ ఇల్లు, A house. |
| (శ్రోణ్యామ) ప్యారోహో (వరస్త్రియాః)। | ఆరోహః ॥ పు॥, వరస్త్రియాః = ఉత్తమస్త్రీ యొక్క, శ్రోణ్యామ్ = పిఱుఁదు, A woman's waist, (అపి) ఏనుఁగు మావటివాఁడు, Rider of an elephant; ఎక్కుట, Ascent; నిడుపు, Length, పొడవు, Height. |
| వ్యూహో (బృన్దే) | వ్యూహః॥పు॥,బృన్దే=సమూహము, Multitude; (అపి) పౌఁజుబారు తీర్చుట, Array of troops; మిక్కిలియూహ,Reasoning;రచన, Fabrication. |
| వ్య హి (ర్వృత్రేఽ) | అహిః॥పు॥, వృత్రే=వృత్రాసురుఁడు, A demon; (అపి) పాము, A serpent. |
| (వ్యగ్నీన్ద్వర్కాః)స్తమోఽపహాః॥ 36—3॥ | తమోఽపహాః ॥పు॥, అగ్ని = అగ్ని, Fire; ఇన్దు=చంద్రుఁడు, The moon; అర్కాః = సూర్యుఁడు, The sun. |
| (పరిచ్ఛదే నృపార్హేఽర్థే) పరిబర్హో | పరిబర్హః॥పు॥,పరిచ్ఛదే=పరివారము, Retinue; నృపార్హే = రాజునకు యోగ్యమయిన, అర్థే= ఛత్రచామరాదివస్తువు, Insignia of royalty. |
| ॥ఇతి హాన్తాః॥ | ॥ హాన్తనానార్థకశబ్దములు ముగిసెను. ॥ |
| (ఽవ్యయాఃపరే)। The following are indeclinable. | ఇదిమొదలు లింగాదిసంగ్రహవర్గ దనుకఁ జెప్పఁగలశబ్దము లవ్యయంబులు. అందులో నానార్థావ్యయంబులు ముందుఁజెప్పి వెనుక నేకార్థకావ్యయంబులు చెప్పంబడుచున్నవి. |
| ఇతి నానార్థవర్గః. | { అనేకములైన యర్థములుగల పద సమూహము ముగిసెను. } |

ఆఙ్ (ఈషదర్థేఽభివ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే)॥ ౩౯౮॥

టీ.-ఆఙ్ ॥అ॥ ఇది, ఈషదర్థే=ఇంచుక యనునర్థమునందును, ॥ఉ॥ ఆపాణ్డరీభూతముఖచ్ఛవీనామ్, A little, అభివ్యాప్తౌ = ఒకక్రియకు మేరను జెప్పునపుడు దానితోడ నను నర్థమునందును, ॥ఉ॥ఆకుమారంయశఃపాణినే, Including; సీమార్థే=ఒకక్రియకు మేరను జెప్పునపుడు అందాఁకఅనునర్థమునందును,॥ ఉ॥ ఓదకాన్తంప్రియంపాన్థమనువ్రజేత్, Up to; ధాతుయోగజే=క్రియయొక్క సంబంధమువలనఁ బుట్టుదానియందు, అనఁగా గ్రియాయోగమువలనఁ బుట్టినక్రియార్థద్యోతకత్వమునందును వర్తించును,॥ఉ॥ఆహరతి.

మూ॥ ఆ(ప్రగృహ్యః స్మృతౌ వాక్యేఽ)

టీ.-ఆ॥అ॥ ఇది,స్మృతౌ=తలంపునందును, Oh (remembering); ॥ఉ॥ ఆ ఏవంకిలతత్, వాక్యే=వాక్యపూరణమునందును వర్తించును, Expletive; ॥ఉ॥ఆ ఏవంను మన్యసే; ఆ అద్య స్వా ద్విష్టభోజనం లబ్ధమితి; ప్రగృహ్యః= దీనికిప్రగృహ్యమన్నందున సంధిలేదు.

హ్యాః(కోపేతాపపీడయోః) ।

టీ.-ఆః॥అ॥ ఇది, కోప=కోపమునందును, ॥ఉ॥ఆఃరక్షన్తిష్ఠ, తాప=తాపమునందును,॥ఉ॥ఆఃక్వాసిప్రియే; పీడయోః = పీడయందును వర్తించును, ఉ॥ విద్యాంమాతరఃసూః ప్రదర్శ్య బ్రసృపశూన్ భక్షస్వ; ఆఃకష్టంవర్తస్తే. Alas (sorrowfully, angrily, painfully).

(పాప కుత్సేషదర్థే) కు

టీ.-కు॥ అ॥ ఇది, పాప=పాపమునందును, ॥ఉ॥ త్యజేత్కుజనసంగతిమ్, Sinful, కుత్సా=నిందయందును, ॥ఉ॥కుభోజనమ్, Bad; ఈషదర్థే=ఇంచుకయను నర్థమునందు [illegible] ॥ఉ॥ కవోష్ణమ్, కోష్ణమ్, A little.

ధిక్ (నిర్భర్త్సన నిన్దయోః)॥ ౩౯౯॥

టీ.-ధిక్॥అ॥ ఇది, నిర్భర్త్సన= అదలించుటయందును,॥ఉ॥ ధిక్ గ్రామం నిష్ఠురాలాపమ్, నిన్దయోః = నిందయందునువర్తించును, ॥ఉ॥ ధిగిమాం దేహభృతామసారతామ్. Fy! (menacingly; reproachfully.)

మూ॥చా (న్వాచయ సమాహార రేతరేతర సముచ్చయే) ।

టీ.-చ॥అ॥ఇది, అన్వాచయ=రెండుక్రియలలో నొకటిప్రధానమై యొ

కటియు ప్రధానమైయుండుటయను నన్వాచయమునందును, Moreover, ‖ఉ‖ భిక్షామట గాంచానయ; సమాహార=ఒక క్రియలో నవయవ వస్తువులకు ప్రాధాన్యము లేక సముదాయమే ప్రధానమయియుండుట యనుసమాహారమునందును, And, ‖ఉ‖ ఛత్త్రోపానహమ్, అశ్వబలీవర్దమ్; ఇతరేతర=పరస్పరసాపేక్షములయిన యవయవవస్తువులకు నొకక్రియతో సంబంధముగలుగుట యనునితరేతరయోగమునందును, Mutually, ‖ ఉ ‖ దేవదత్తయజ్ఞదత్తాభ్యామిదంకార్యమ్; సముచ్చయే=పరస్పరనిరపేక్షములయిన యవయవవస్తువులకు నొకక్రియతో సంబంధముగలుగుట యను సముచ్చయమునందును Also, ‖ ఉ ‖ రాజ్ఞోగారశ్వః పురుషశ్చ; పాదపూరణ పక్షాంతర హేతునిశ్చయములయందును వర్తించును.

స్వ(స్త్యాశీః క్షేమపుణ్యాదౌ)

టీ.—స్వస్తి‖అ‖ఇది, ఆశీః=ఆశీర్వాదమునందును, Well(a benediction); ‖ఉ‖ స్వస్తితేఽస్తులతయాసహావృక్ష; క్షేమ=నిరుపద్రవమునందును, Safety; ‖ఉ‖ స్వస్తిప్రజాభ్యః; భూతానుకమ్పాతవచేదియంగా రేకాభవేత్స్వస్తిమతీత్వదస్తే, పుణ్య=పుణ్యమునందును, Virtue; ‖ ఉ ‖ స్వస్తిమాన్ స్వర్గమశ్నుతే, ఆదిశబ్దమువలన శుభాదులయందునువర్తించును, Auspicious &c ‖ఉ‖ప్రస్థానికంస్వస్త్యయనంప్రయుజ్య.

(ప్రకర్షే లఙ్ఘనే) ప్యతి‖ ౩౩౭‖

టీ.—అతి‖ అ‖ ఇది, ప్రకర్షే=మిక్కిలియనునర్థమునందును, Very, ‖ఉ‖ అతివృద్ధః; అతిశేతే; లఙ్ఘనే=దాటిననుటయందును, Past; surpassing; excellent. ‖ఉ‖ అతీతకాలస్త్వహామభ్యుపేతః, అపిశబ్దమువలన పూజయందును వర్తించును.

మూ‖స్విత్(ప్రశ్నే చ వితర్కే చ)

టీ.—స్విత్‖అ‖ ఇది, ప్రశ్నయందును, What (interrogative); ‖ఉ‖ కస్స్విదేకాకీచరతి; వితర్కేచ=వితర్కమునందును వర్తించును, What (doubtingly) ‖ఉ‖అధస్స్విదాసీ దుపరిస్విదాసీత్.

తు(స్యా ద్భేదేఽవధారణే ।

టీ.—తు‖ అ‖ ఇది, భేదే=భేదమునందును, But(indicating difference), ‖ ఉ ‖ పూజ్యాగాః కపిలాతుపూజ్యతరా ; అవధారణే=నిశ్చయమందును

వర్తించును, Indeed. ॥ఉ॥ వేదాస్తు ప్రమాణమ్.

సకృ (త్స హైకవారే స్యాత్)

టీ.-సకృత్ ॥అ॥ ఇది, సహ=తోడ ననునర్థమునందును, Together;॥ఉ॥ దేవదత్తయజ్ఞదత్తౌ సకృద్భుఞ్జాతే;ఏకవారే=ఒకసారియనునర్థమునందును వర్తించును, Once. ॥ఉ॥ సకృత్ప్రదీయతే కన్యా.

ఆరా (ద్దూర సమీపయోః)॥

టీ.-ఆరాత్ ॥అ॥ఇది, దూర= దూరమునందును, Far; ॥ఉ॥ ఆరాద్గతో దృష్టిపథంవ్యతీతః, సమీపయోః=సమీపమునందునువర్తించును, Near. ॥ఉ॥తమర్చ్య మారా దభివర్తమానమ్.

మూ॥ (ప్రతీచ్యాం చరమే) పశ్చాత్

టీ.-పశ్చాత్ ॥అ॥ఇది, ప్రతీచ్యామ్=పడమటిదిక్కునందును,Westward; ॥ఉ॥ పశ్చాదస్తంగతో రవిః; చరమే = వెనుకదిక్కునందును వర్తించును, Afterwards, lastly; behind. ॥ఉ॥ పశ్చాద్యాతి; శ్రోత్రియేభ్యః పూర్వం దీయతాం పశ్చా దితరేభ్యః

ఉతా(ప్యర్థ వికల్పయోః) ।

టీ.-ఉత॥అ॥ఇది,అప్యర్థ=అప్యర్థమునందును, Also; ॥ఉ॥ఉతభిన్ద్యాచ్ఛిరసాశిలోచ్చయమ్; ఉతదణ్డఃపతిష్యతి; వికల్పయోః=ఇటోఅటో అనువికల్పార్థమునందునువర్తించును, What (doubtingly), either. ॥ఉ॥ ఉతపర్వతో భిద్యేత; ఉతతృప్యేద్వజ్రీ.అప్యర్థమనఁగా దృఢార్థమును ప్రశ్నయును.

(పున స్సదార్థయో) శ్శశ్వత్

టీ.-శశ్వత్ ॥అ॥ ఇది, పునః=మరియు ననునర్థమునందును, Again; ॥ఉ॥ శశ్వత్పశ్యత శబ్దవార్ధిలహరీవిద్యోల్బణమ్; సదార్థయోః = ఎల్లపుడు ననునర్థమునందునువర్తించును, Constantly; for ever. ॥ఉ॥ శాశ్వతంవైరమ్.

సాక్షా(త్ప్రత్యక్షతుల్యయోః)॥౩౯౦॥

టీ.-సాక్షాత్ ॥అ॥ఇది, ప్రత్యక్ష= ప్రత్యక్షమునందును, Actually; ॥ఉ॥ సాక్షాద్దృష్టోఽసి; తుల్యయోః = సమానమునందును వర్తించును, Like; in person. ॥ఉ॥ ఏషా సాక్షాల్లక్ష్మీః.

మూ॥(ఖే దానుకమ్పాసన్తోష విస్మ యామన్త్రణే) బత।

టీ.-బత॥అ॥ ఇది, ఖేద=ఖేదమునందును, Alas (expressing sorrow),

॥ఉ॥ అహో బత మహత్కష్టమ్; అనుకమ్పా=దయయందును,(—pity), ॥ఉ॥ మారోదీ ర్బతపుత్రత్వమ్, సన్తోష=సంతోషమునందును, (—joy), ॥ఉ॥బతముక్తాస్మకిల్బిషాత్, విస్మయ=ఆశ్చర్యమునందును, (—surprise), ॥ఉ॥ అహో బతాసిస్పృహణీయవీర్యః. ఆమన్త్రణే = పిలుచుటయందును వర్తించును, ॥ఉ॥ ఏహింబత. Oh! (calling).

హన్త (హర్షేఽనుకమ్పాయాం వాక్యారమ్భవిషాదయోః)॥

టీ.—హన్త॥అ॥ఇది,హర్షే=సంతోషమునందును, Oh (expressing joy,) ॥ ఉ ॥ హన్తజీవితాఃస్మః; అనుకమ్పాయామ్=దయయందును, (—compassion), ॥ఉ॥ మారోదీర్హన్తపుత్రక; వాక్యారమ్భ=వాక్యారంభమునందును, ॥ ఉ॥ హన్త తేకథయిష్యామః, విషాదయోః=దుఃఖించుటయందును వర్తించును, (—greef) ॥ఉ॥హన్త హతాః పథికగేహిన్యః.

మూ॥ప్రతి(ప్రతినిధౌ వీప్సా లక్షణాదౌ ప్రయోగతః)।

టీ.-ప్రతి॥అ॥ ఇది, ప్రతినిధౌ=సదృశార్థమునందును, Instead, ॥ఉ॥ అభిమన్యురర్జునాత్ప్రతి; వీప్సా=గుణక్రియలచేత నన్నివస్తువులను ప్రత్యేకముగావ్యాపింపనిచ్ఛగించుట యనువీప్సయందును, Each; ॥ ఉ ॥ వృక్షంవృక్షంప్రతిసిఞ్చతి; లక్షణ = గుఱించి, Towards; for; ॥ ఉ ॥ వృక్షంవృక్షంప్రతి విద్యోతతే విద్యుత్; ఆదౌ=మొదలయినదానియందును, ఆదిపదముచేత నొకప్రకారమును బొందినవానిఁగాఁజెప్పుట యను నిత్థంభూతాఖ్యానమునందును, As to,॥ఉ॥సాధుర్మాతరంప్రతి, ప్రయోగతః=ఒకటినిచ్చి మరియొకటిపుచ్చుకొనుట యను ప్రతిదానమునందును, In exchange. ॥ఉ॥ తిలేభ్యోమాషాన్ ప్రతియచ్ఛతి; భాగమునందును వర్తించును, Belonging to (as a portion),॥ఉ॥ యదత్రమాంప్రతి స్యాత్తద్దీయతామ్.

ఇతి (హేతు ప్రకరణ ప్రకాశాది సమాప్తిషు)॥ ౪౦౦

టీ.—ఇతి॥అ॥ ఇది, హేతు=కారణమునందును, Therefore; ॥ఉ॥హన్తీతి పలాయతే; ప్రకరణ=ప్రకారమునందును, Thus, ॥ఉ॥ గౌరశ్వోహస్తీతి జాతిః; ప్రకాశ=ప్రకాశమునందును, Well known as such, ॥ఉ॥ ఇతిప్రాణినః, ఆది=మొదలనునర్థమునందును, Etcoetera, ॥ఉ॥ హేలాలీలేత్యమీహావాః; సమాప్తిషు=ముగియుటయందును వర్తించును, Finis.॥ఉ॥ ఇతి ప్రథమస్సర్గః.

మూ॥ (ప్రాచ్యాం) పురస్తా (త్ప్రథమే పురార్థేఽగ్రత ఇత్యపి)।

టీ.-పురస్తాత్ ॥ అవ్య॥ ఇది, ప్రాచ్యామ్=తూర్పుదిక్కునందును, Eastward, ॥ఉ ॥ పురస్తాదుదేతిసూర్యః, ప్రథమే=మొదలనునర్థమునందును, First, ॥ఉ॥ పురస్తాత్క్రియతేకర్మ పశ్చాత్సిద్ధ్యతి తత్ఫలమ్; పురార్థే=తొల్లియనునర్థమునందును, Formerly, ॥ఉ॥ పురస్తాద్రామోఽభూత్; అగ్రతఇత్యపి=ముందర అనునర్థమునందును వర్తించును, In front; ॥ఉ॥ పురస్తాత్సేనా నిర్యాతి.

యావత్తావ (చ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే)॥ ౨౦౧॥

టీ.-యావత్-తావత్ ॥అవ్య॥ ఈ౨ను, సాకల్యే=అంతయు ననునర్థము నందును, As much as (the whole), ॥ఉ॥ యావత్కార్యం తావత్కురు; అవధౌ = మేరయందును, Until, ॥ఉ॥ యావత్సస్యం క్షేత్రంతావత్కంటకివృక్షైఃపరివృతమ్; మానే = పరిమాణమునందును, As many as (number), ॥ఉ॥ యావద్దత్తం తావద్భుక్తమ్; అవధారణే=పరిమాణనిశ్చయమునందును వర్తించును, So much (affirmative), ॥ఉ॥ యావదమత్రం తావద్బ్రాహ్మణా నామన్త్రయస్వ.

మూ॥ (మఙ్గలానన్తరారమ్భ ప్రశ్న కార్త్స్న్యే)ష్వథో అథ।

టీ.-అథో-అథ॥అవ్య॥ ఈ౨ను, మఙ్గల=మంగళార్థమునందును, Auspicious particle; ॥ఉ॥ అథవర్ణసమామ్నాయః; అనన్తర=తర్వాత ననునర్థమునందును, After, ॥ఉ॥ అథప్రజానామధిపఃప్రభాతే;ఆరమ్భ=దొరకొనుటయందును, Now, ॥ఉ॥ అథేదానీమేతన్నిరూప్యతే, ప్రశ్న=అడుగుటయందును, What?, ॥ఉ॥ అథైకధేనోరపరాధచణ్డాద్గురోః కృశాను ప్రతిమా ద్బిభేషి; కార్త్స్న్యేషు=అంతయు ననునర్థమునందును వర్తించును, All (comprehensively), ॥ఉ॥ అథ చురాదయః కథ్యన్తే.

వృథా(నిరర్థకావిధ్యోః)

టీ.-వృథా॥అవ్య॥ఇది,నిరర్థక=వ్యర్థమనుటయందును,In vain; ॥ఉ॥ప్రాసాదశృఙ్గాణివృథాఽధ్యరుక్షన్;అవిధ్యోః=విధిలేక చేయుటయందునువర్తించును, Improperly,॥ఉ॥ ప్రపచ్యతే స నరకే యో వృథా లభతే పశుమ్.

నానా(ఽనేకోభయార్థయోః)॥౨౦౨॥

టీ.-నానా॥ అ॥ ఇది, అనేక=బహుప్రకారమునందును, Many; ॥ఉ॥

నానాచేష్టై ర్జలదలలితై ర్నిర్జితంతంన గేన్ద్రమ్; ఉభయార్థయోః=రెంటియం దునువర్తించును, Both, ॥ఉ॥నానాగ్రాం సమిధంత్యజేత్.

మూ॥ ను (పృచ్ఛాయాంవికల్పేచ)

టీ.-ను॥ అవ్య॥ ఇది, పృచ్ఛాయామ్=ప్రశ్నయందును, What?, ॥ఉ॥ కోనుధావతి, వికల్పేచ=వికల్పమునందును వర్తించును, Or, ॥ఉ॥ భీమో ను ఫల్గునోను యోద్ధా.

(పశ్చాత్సాదృశ్యయో)రను ।

టీ.-అను॥ అ॥ ఇది, పశ్చాత్ = వెనుక అనుసర్థమునందును, After, ॥ఉ॥ తమనుధావతి , సాదృశ్యయోః = సాదృశ్యమునందును వర్తించును, Like; మాతరమనుకరోతి; మరియులక్షణా,Indication,ఇత్థంభూతాఖ్యాన, In particular relation; భాగ, A share ; వీప్సా, Repetition; సమీప Near, ములయందును వర్తించును,

(ప్రశ్నాఽవధారణాఽనుజ్ఞాఽనునయాఽమన్త్రణే)నను॥౪౦౩॥

టీ.-నను॥ అ॥ ఇది, ప్రశ్న = ప్రశ్నయందును, What?, ॥ఉ॥ నన్వ భోజి; అవధారణా=నిశ్చయమునందును, Certainly, ॥ఉ॥నన్వథగచ్ఛామః, అనుజ్ఞా = అనుమతియందును, Indicating assent, ॥ఉ॥ నన్వాదిశ; అనునయ = ఊఱడించుటయందును, A consolatory and kind expression, ॥ఉ॥ ననుచణ్డి ప్రసీదమే, ఆమన్త్రణే=సంబోధనమునందును వర్తించును, Vocative particle, ॥ఉ॥ ననుదేవదత్త.

మూ॥ (గర్హా సముచ్చయ ప్రశ్న శఙ్కా సమ్భావనా) స్వపి ।

టీ.-అపి॥అ॥ ఇది, గర్హా = నిందయందును, Reprehensive particle, ॥ఉ॥ అపిసిఞ్చేత్పలాణ్డుమ్; సముచ్చయ = సముచ్చయమునందును, And, ॥ఉ॥ భీమోఽర్జునోఽపి; ప్రశ్న=ప్రశ్నయందును, Earnest inquiry, ॥ఉ॥ అపిక్రియార్థం సులభం సమిత్కుశమ్, శఙ్కా=అనిష్టము నూహించుట యందును, Doubt or suspicion; ॥ఉ॥ అప్యాగచ్ఛేద్వ్యఘ్రః; సమ్భావనాను=ఇది యిటువలె సంభవించు ననుసంభావనయందును వర్తించును, Possibility and likelihood, even, ॥ఉ॥ సముద్రమపిలఙ్ఘయేత్.

(ఉపమాయాం వికల్పే) వా

టీ.-వా॥అ॥ ఇది, ఉపమాయామ్=పోలికయందును, Like, ॥ఉ॥ ఆశీవి

షో వాసంక్రుద్ధః; వికల్పే=వికల్పమునందును వర్తించును, Or, either; ॥ఉ॥ యద్వైర్ణ్వ్రిపిం ... ర్వా యతేత.

సామి (త్వర్ధే జుగుప్సనే)॥ ౪౦౪॥

టీ.—సామి॥అ॥ ఇది, అర్ధే=సగమను వర్థమునందును, Half; ॥ఉ॥ సామినిమీలితాక్షీ, జుగుప్సనే=నిందయందును వర్తించును, Blamably, ॥ఉ॥ సామ్యధ్యయన మనధ్యాయే.

మూ॥ అమా (సహ సమీపేచ)

టీ.—అమా॥అ॥ఇది,సహ=కూడననునర్థమునందును, With, ॥ఉ॥ అమావాస్యా; సమీపేచ=సమీపమునందునువర్తించును,Near,॥ఉ॥అమాత్యః.

కం (వారిణి చ మూర్ధ్నిచ) ।

టీ.—కమ్॥అ॥ ఇది, వారిణి=నీళ్ళయందును, Water, ॥ఉ॥ కంజంపద్మమ్; మూర్ధ్నిచ=శిరస్సునందును, Head, ॥ఉ॥కన్ధరా; చకారమువలన సుఖమునందునువర్తించును, Pleasure, ease, ॥ఉ॥ కన్దర్పః.

(ఇ వేత్థమర్థయో) రేవం

టీ.—ఏవమ్।అ॥ఇది, ఇవ=పోలికయందును, Like, as, ॥ఉ॥ భానురేవం మునిర్భాతి; ఇత్థమర్థయోః = ఈప్రకారమనుటయందును వర్తించును, Thus, ॥ఉ॥ ఏవంవాదిని దేవర్షౌ.

నూనం (తర్కే౽ర్థనిశ్చయే) ॥౪౦౫॥

టీ.—నూనమ్॥అ॥ ఇది, తర్కే=ఊహయందును, Perhaps ; ॥ఉ॥నూనమున్నమతి యజ్వనాంపతిః, అర్థనిశ్చయే = అర్థనిశ్చయమునందును వర్తించును,Certainly,॥ఉ॥త్వము(?)ద్రే౽పినూనం శరణం ప్రపన్నే,ఉత్ప్రేక్షకు,Indicating recollection ॥ఉ॥మదన స్యేవ ఘ్రానూనంయువతీనాందృశశ్శితాః.

మూ॥(తూష్ణీమర్థే సుఖే) జోషం

టీ.—జోషమ్॥అ॥ఇది,తూష్ణీమర్థే=మౌనమునందును,Silently, ॥ఉ॥ ఇతి జోషమవస్థితేమునౌ, సుఖే=సుఖమునందునువర్తించును , At ease, ॥ఉ॥ జోషమాసీతవర్షాసు.

కిం (పృచ్ఛాయాం జుగుప్సనే) ।

టీ.—కిమ్॥అ॥ఇది, పృచ్ఛాయామ్=ప్రశ్నయందును, What?, ॥ఉ॥ కింగతో౽సి; జుగుప్సనే = నిందయందును వర్తించును,Bad. ॥ ఉ ॥ కింరాజా యో న రక్షతి.

నామ(ప్రాకాశ్య సంభావ్య క్రోధోపగమ కుత్సనే)॥ ౪౦౬॥

టీ.-నామ ॥ అ॥ ఇది, ప్రాకాశ్య = ఎఱింగింపఁబడిన యర్థమునందును, Evidently, ॥ ఉ ॥ హిమాలయోనామనగాధిరాజః ; సంభావ్య=ఇటువలె సంభవించు ననునర్థమునందును, Possibly, ॥ఉ ॥ అపీహసీతానామసంభవిష్యతి; క్రోధ=కోపమునందును, Wrath, ॥ఉ ॥ అశకంసస్యభయం నామ గోపాన్నాపిసురద్విషః, ఉపగమ = అంగీకారమునందును, Indignant consent, ॥ఉ॥ అస్తునామధనీకించిదదాతి; [ప] కోపముచేత నంగీకరించుటయందును, Reproach, కుత్సనే=నిందయందును వర్తించును, ॥ఉ॥కోనామాయం ప్రలపతి విభోర్విశ్వశక్త్యం సభాయామ్.

మూ॥అలం (భూషణ పర్యాప్తి శక్తి వారణవాచకమ్) ।

టీ.-అలమ్॥ అ॥ ఇది, భూషణ=భూషణమునందును; Ornament, ॥ఉ॥ అలంచకారాస్యవధూరహస్కరః, పర్యాప్తి=పూర్ణమనునర్థమునందును, Enough; ॥ఉ॥ తస్యాలమేషాక్షుధితస్యతృప్త్యై; శక్తి = సమర్థుఁడను నర్థమునందును, Able; ॥ఉ॥ అలందశాస్యవ్యవధాయరాఘవః; వారణవాచకమ్=చాలింపుమను నర్థమునందును వర్తించును, Prohibition; ॥ఉ॥ అలంవివాదేన యథాశ్రుతం త్వయా.

హుం (వితర్కే పరిప్రశ్నే)

టీ.-హుమ్॥ అ॥ ఇది, వితర్కే=ఊహయందును, Indicative of doubt and reflection; ॥ఉ॥ హుంజలంమృగతృష్ణా, పరిప్రశ్నే=ప్రశ్నయందును, ॥ఉ॥ హుందేవదత్తోఽయమ్; కోపమునందును, ॥ఉ॥ హుంనిహన్మిసహసాయుధిశత్రూన్; భర్త్సనచుటయందును వర్తించును, ॥ఉ॥ హుంనిర్లజ్జమ్. What (indicating anger, fear, dislike or reproach.)

సమయా(ఽన్తిక మధ్యయోః)॥

టీ.-సమయా॥అ॥ ఇది, అన్తిక=సమీపమునందును, Near,॥ఉ॥గఙ్గా సమయావారాణసీ ; మధ్యయోః=నడిమియందును వర్తించును, Within, midst, ॥ఉ॥ సమయాశైలయోర్నదీ.

మూ॥ పున (రప్రథమే భేదే)

టీ.-పునర్ ॥ అ॥ ఇది, అప్రథమే=మరియు అనునర్థమునందును, Again, ॥ఉ॥ పునర్బభాషేతురగస్యరక్షితా; భేదే=విశేషమునందును వర్తించును,

॥ఉ॥ భ్రాతృషు పునర్దీర్ఘో భవాన్. But, on the contrary.

నిర్నిశ్చయ నిషేధయోః) ।

టీ.-నిర్॥ అ॥ ఇది, నిశ్చయ=నిశ్చయమునందును, Certainly; ॥ఉ॥ నిర్ణయః; నిషేధయోః=నిషేధమునందునువర్తించును, Negation,॥ఉ॥ నిర్ధనః.

(స్యాత్ప్రబన్ధే చిరాతీతే నికటాఽగామికే) పురా॥ ౨౦౮॥

టీ - పురా॥ అ॥ ఇది, ప్రబన్ధే=వాక్యరచనయందును, Text; ॥ఉ॥ పురాణమ్, చిర=దీర్ఘకాలమునందును, Long since; ॥ఉ॥ పురాతనమ్; అతీతే = పోయినకాలమునందును, Old; past, ॥ఉ॥ పురాగతః; నికట=సమీపమునందును, Near, ॥ఉ॥పురాగచ్ఛతి;ఆగామికే=రాఁగలదానియందును, Future, వర్తించును, ॥ ఉ॥ ఆలోకేతేనిపతతిపురాసా బలి వ్యాకులావా; మఱియు నెడతెగనిపాఠమునందును, Ceaseles study; ॥ఉ॥ ఉపాధ్యాయేన పురాఽధీయతేస్మ;పూర్వ మనేక కాలము పోయినదానియందును, Long in the past, ॥ఉ॥ పురాతనంత్వాం పురుషంపురావిదః ; ఆసన్నభవిష్యదర్థమందును, Proximate future. ॥ఉ॥ గచ్ఛశీఘ్రపురా దేవోవర్షతి.

మూ॥ ఊరర్యురీచోరరీ (చవిస్తారేఽఙ్గీకృతౌ త్రయమ్)।

టీ.-ఊరరీ-ఉరీ[పా]ఊరీ-ఉరరీ॥ అ॥ ఈ 3ను, విస్తారే=విస్తారమునందును, Expansion, ॥ఉ॥ అర్థిషున్వయమురీకృతకామ్యః; అఙ్గీకృతౌ=ఈయకొనుటయందును వర్తించును, Assent,॥ఉ॥ అజ్ఞామురరీకృత్యయాతి.

(స్వర్గేచ పరలోకే) స్వర్

టీ.- స్వర్॥అ॥ఇది, స్వర్గే=స్వర్గమునందును, Heaven; ॥ఉ॥స్వర్నద్యాం స్నాతినారదః; పరలోకే=పరలోకమునందును, The next world; చకారమువలన జన్మాంతరమునందును, ॥ఉ॥ స్వర్గతస్య'క్రియాఃకుర్యాత్పుత్రఃపరమభక్తితః, స్వర్యాతస్యహ్యపుత్రపత్నీతద్భాగమర్హతి;సుఖమునందును, Happiness; ఆకాశమునందును, The sky, వర్తించును.

(వార్తా సంభావ్యయోః) కిల॥౨౦౯॥

టీ.-కిల॥అ॥ఇది,వార్తా=లోకవాడుకయందును,News,॥ఉ॥జఘానకంసం కిలవాసుదేవః,సంభావ్యయోః=ఇదిసంభవించుననునర్థమునందును, Probably, ॥ఉ॥ అర్జునఃకిలవిజేష్యతేకురూన్; మరియు, అసత్యమందునువర్తించును, Falsely, ॥ఉ॥ గోత్రస్ఖలితంకిలాఽశ్రితమ్. Indicating displeasure.

మూ॥ (నిషేధ వాక్యాలంకార జిజ్ఞాసానునయే) ఖలు।

టీ.- ఖలు॥అ॥ ఇది, నిషేధ = ప్రతిషేధమునందును, Prohibition; ॥ఉ॥ నిర్ధారితేऽర్థేలేఖ్యేనఖలూక్త్వాఖలువాచికమ్; వాక్యాలంకార = వాక్యాలంకారమునందును, Expletive; ॥ఉ॥ అథఖలుభగవాన్; జిజ్ఞాసా=ఎఱుఁగనిచ్ఛయించుటయందును, Indicating enquiry; ॥ఉ॥ కింఖల్వధీతేపుత్త్రః, అనునయే = ఊఱడించుటయందును వర్తించును, A conciliatory expression. ॥ఉ॥ నఖలునఖలు ముగ్ధే సాహసం కార్యమేతత్.

(సమీపో భయతశ్శీఘ్రసాకల్యాభిముఖే)ऽభితః॥ ౪౧౦ ॥

టీ.- అభితః॥అ॥ఇది, సమీప=సమీపమునందును, Near, ॥ఉ॥ వారాణసీ మభితోభాగీరథీ, ఉభయతః=ఇరుపార్శ్వములయందును, On both sides; ॥ఉ॥శేషేऽభితః పాతుకసిద్ధసిద్ధోః; శీఘ్రమునందును, Quickly; ॥ఉ॥ అభిశ్శత్రురాయాతి; సాకల్య=అంతయుననునర్థమునందును,Entirely; ॥ఉ॥ భుక్తేऽన్నమభితోऽతిథిః; అభిముఖే=ఎదురుగా ననునర్థమునందును వర్తించును, In front. ॥ఉ॥ అభితోహింసకోదన్తీ మామేవపరిధావతి.

మూ॥ (నామప్రాకాశ్యయోః) ప్రాదుః

టీ.-ప్రాదుః॥అ॥ ఇది, నామ = నామధేయమునందును, Name, ఉ॥ విష్ణోర్దశ ప్రాదుర్భావాః; [ప] సంభావనయందును, ప్రాకాశ్యయోః=ప్రకాశించుదానియందును వర్తించును, Appearance, ॥ఉ॥ ప్రాదురాసీద్వసుంధరా, "జన్మప్రాకాశ్యయోఃప్రాదుః" అనిపాఠముగలదు.

మిథో(ऽన్యోన్యం రహస్యపి)।

టీ.-మిథః॥అ॥ ఇది, అన్యోన్యమ్ = తమలోఁదాము ననునర్థమునందును, Mutually; ॥ఉ॥ వాసిష్ఠకౌణ్డిన్యమైత్రావరుణాఃమిథోనవివాహ్యాః, రహస్యపి=ఏకాంతమునందునువర్తించును, In private. ॥ఉ॥ మిథస్త్వదాభాషణలోలుపం మనః; మిథఃకృతే మన్మథపేషసాక్షీ.

తిరో (ऽన్తర్ధా తిర్యగర్థే)

టీ.-తిరస్॥ అ॥ ఇది, అన్తర్ధా=కప్పుటయందును, Concealment; ॥ఉ॥ కృష్ణమేఘస్తిరోదధే; తిర్యగర్థే=అడ్డముగాననునర్థమునందునువర్తించును, Awry. ॥ఉ॥ గతంతిరశ్చీనమనూరుసారథేః.

హా (విషాద శుగార్తిషు)॥ ౪౧౧॥

టీ.—హా॥అ॥ ఇది, విషాద=వ్యథపడుటయందును, Alas!, ॥ఉ॥ పుణ్యా న్తః పురమేవహా ప్రవిశతి క్రుద్ధోమునిర్భార్గవః; శుక్ = శోకమునందును, Regret, ॥ఉ॥ హా ప్రియే జనకరాజపుత్రి; ఆర్తిషు = పీడయందునువర్తించును, Alas, ॥ఉ॥ హాహతోఽస్మి.

మూ॥ అహ (హేత్యద్భుతే ఖేదే)

టీ.—అహహ[ప] అహహా॥అ॥ఇది, అద్భుతే=ఆశ్చర్యమునందును, Indication of wonder, ॥ఉ॥ అహహమహతాం నిస్సీమానశ్చరిత్రవిభూతయః, ఖేదే=వ్యసనపడుటయందునువర్తించును, Of pain or fatigue, ॥ఉ॥ అహహాకష్టమపణ్డితతావిధేః ॥ ఉ ॥ అహహాభిక్షమాణోఽపి క్షుధా సంపీడ్యతే జనః.

హి (హేతా వవధారణే)।

టీ.—హి॥అ॥ఇది, హేతౌ = కారణమునందును, Because, ॥ఉ॥ జానామ్యగ్నిరిహాస్తీతి మహాన్ధూమోహిదృశ్యతే, అవధారణే = నిశ్చయమునందునువర్తించును, Indeed, ॥ఉ॥ చన్ద్రోహిశీతః, పరుషోక్తిఃకథంతస్మిన్ బ్రూహి త్వంహి తపోధన.

{ ఇతి నానార్థావ్యయవర్గః=అనేకార్థములుగల అవ్యయపదసమూహము ముగిసెను. }

చిరాయ చిరరాత్రాయ చిరస్యాఽ(ద్యాశ్చిరార్థకాః) ॥ ౪౧ ॥

టీ.—చిరాయ-చిరరాత్రాయ - చిరస్య ॥అ॥ఈ 3 ను ఆద్యశబ్దముచేత, చిరమ్ - చిరేణ - చిరాత్, అను నవ్యయములును, చిర=బహుకాలమను, అర్థకాః = అర్థమునందువర్తించును, తడవనుట, ॥ఉ॥ చిరాయసంతర్ప్య సమిద్భిరగ్నిమ్; చిరరాత్రాయసంచితమ్; చిరస్యదృష్టేవ మృతోత్థితేవ; చిరంనసహతేస్థాతుంపరేభ్యోభేదశఙ్కయా; చిరేణ నాభింప్రథమోదబిన్దవః, చిరాత్సుతస్పర్శరసజ్ఞతాంయయౌ. Long time.

మూ॥ ముహుః పునఃపున శ్శశ్వ దభీక్ష్ణ మసకృ (త్సమాః)।

టీ.—ముహుః - పునఃపునః - శశ్వత్ - అభీక్ష్ణమ్ - అసకృత్ ॥అ॥ఈ 5 ను, సమాః = సమానార్థకములు, అనఁగా మాటిమాటికి అను నర్థమునందు వర్తించును,॥ఉ॥అవేక్షమాణం మహతీంముహుర్ముహుః, పునఃపునస్సూతనిషిద్ధచాపలమ్; వన్యవృత్తిరిమాంశశ్వత్; అభీక్ష్ణమాస్ఫాలయతీవకుమ్భమ్; అసకృదనవగీతం గీతమాకర్ణయన్తః. Again and again; frequently.

స్రాగ్ఝడిత్యఞ్జసాఽహ్నాయ ద్రాఙ్మఙ్క్షుసపది (ద్రుతే)॥ ౭౧౩॥

టీ.—స్రాక్-ఝడితి [పా] ఝటితి-అఞ్జసా - అహ్నాయ-ద్రాక్ - మఙ్క్షు-స పది॥అ॥ ఈ౭ను,ద్రుతే=శీఘ్రమను నర్థమునందువర్తించును, ॥ఉ॥ స్రాగ్వ యో యాతి దేహినామ్; సుతశతమత్యన్తదుర్భరం ఝడితి ; అఞ్జసాయా తితురగః; అహ్నాయ తావ దరుణేన తమోనిరస్తమ్, ద్రాగ్భవిష్యతి సుఖంతవప్రియే ; మఙ్క్షూదపాదిపరితశ్శపటలైరలీనామ్ ; వచనస్తస్యసపది క్రియాకేవల ముత్తరమ్. Soon, instantly.

మూ॥ బలవత్సుష్ఠు కిముత స్వత్యతీవ (చనిర్భరే)।

టీ.—బలవత్-సుష్ఠు కిముత - సు-అతి - అతీవ ॥అ॥ ఈ౬ను, నిర్భరే= మిక్కిలియను నర్థమునందు వర్తించును, ॥ఉ॥ పునర్వశిత్వా బలవన్నిగృహ్య; సుష్ఠుపీతం మయాఘృతమ్, కిముతాద్యకృతంకార్యమ్, సువృష్టిస్సస్య వర్ధనీ, అతివృష్టి రనావృష్టిః, అతీవ శోభతేరాజా. Much, very.

పృథగ్వినాఽన్తరేణర్తేహిరుఙ్నానా (చవర్జనే)॥ ౭౧౪॥

టీ.—పృథక్-వినా - అన్తరేణ-ఋతే - హిరుక్-నానా ॥అ॥ ఈ ౬ను, వర్జనే=అది తప్పించియనుటయందు వర్తించును, ॥ఉ॥కించిద్దత్వా పృథక్క్రియామ్; క్షణమప్యుత్సహతే నమాంవినా ; అన్తరేణ మతంనాస్తి సుఖం సంసారిణాం భువి ; ఋతేరవేః క్షాళయితుం క్షమేత కః; హిరుక్కర్మన మోక్షఃస్యాత్, నానావిష్ణుం మోక్షదో నాస్తిదేవః. Without; except.

మూ॥ యత్తద్యతస్తతో (హేతౌ)

టీ.—యత్-తత్-యతః-తతః ॥అ॥ ఈ ౪ ను, కారణమునందు వర్తించును, ॥ఉ॥ యద్విద్యాసుప్రగల్భోఽసి తత్సర్వైరపి పూజ్యసే, యతో గఙ్గాఽమ్భసిస్నాత స్తతోనిష్కల్మషోనరః. Because; therefore.

(అసాకల్యేతు) చిచ్చన।

టీ.—చిత్-చన ॥అ॥ ఈ ౨ను, అసాకల్యే=కొంతయను నర్థమునందు వర్తించును, ॥ఉ॥ కరోతి కించిదభ్యాసాత్, అపాత్రే కుశలైర్దేయం నకించన ధనం సదా. కించిత్=Some; కశ్చన=Some body.

కదాచిజ్జాతు

టీ.—కదాచిత్ - జాతు ॥అ॥ ఈ ౨ను, ఒకానొకప్పుడు అను నర్థము

నందు వర్తించును,॥ఉ॥ కదాచి దాసన్నసఖీముఖేన సా , నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి. Sometimes.

సార్థం(తు) సాకం సత్రా సమం సహ॥ ౨౧౫॥

టీ.-సార్థమ్-సాకమ్-సత్రా-సమమ్-సహ ॥అ॥ ఈ ౫ను, తోడ నను నర్థమునందు వర్తించును, ॥ఉ॥ సార్థముద్ధవసీరిభ్యామ్, సాకం శక్తిధరేణ తత్రభవతో దేవాధ్భవానీపతేః; సత్రాకలత్రేణ సుఖంసమశ్నుతే; సమంవ ధూభిర్వ్యలభీర్యువానః, నిఃశ్వాసధూమంసహరత్నభాభిః. Togethe, with.

మూ॥ (ఆనుకూల్యార్థకం) ప్రాధ్వం

టీ.-ప్రాధ్వమ్॥అ॥ ౧, ఆనుకూల్య=అనుకూలతయను, అర్థకమ్=అర్థము గలది. అనఁగా బంధనహేతుకమైన యానుకూల్యమునందు వర్తించును. ॥ఉ॥ సవ్యేతరమ్ ప్రాధ్వ మితః ప్రయుఙ్క్తే. Conformity.

(వ్యర్థకేతు) వృధా ముధా।

టీ.-వృధా-ముధా॥ ఈ ౨ ను, వ్యర్థకే=వ్యర్థ మనునర్థమందు వర్తించును, ॥ఉ॥ ప్రయుక్త మప్యస్త్ర మితో వృధా స్యాత్; తత్రభ్రమత్యేవ ముధాపడఙ్ఘ్రిః. In vain.

ఆహో ఉతాహో కిముత (వికల్పే) కిం కి మూత చ ॥ ౨౧౬॥

టీ.-ఆహో [పా] అహో-ఉతాహో-కిముత-కిమ్-కిము-ఉత ॥అ॥ ఈ ౬ను, వికల్పే=వికల్పమునందు వర్తించును, ॥ఉ॥ స్థాణు రయమాహో పురుషః; ఉతాహోస్విద్భవే రాజా నలఃపరపురఞ్జయః; కిముత త్వం శివ్యో బ్రహ్మా; స్థాణురయం కింపురుషః; కిము తేకార్యము తాన్యదీయకార్యమ్. Either, or (indicating deliberation.)

మూ॥ తు హి చ స్మ హ వై (పాదపూరణే)

టీ.-తు-హి-చ-స్మ-హ-వై ॥అ॥ ఈ ౬ను, పాదపూరణే = పాదపూరణమునందు వర్తించును, ॥ఉ॥ రామస్తులక్ష్మణం ప్రాహ; అహంహియాస్యే నగరమ్ ; సచ ప్రాహచరాజానమ్ ; మయాస్మభుక్తం సహసా; రామం హ ప్రాహలక్ష్మణః; తేనవై రాక్షసో హతః. Epletives.

(పూజనే) స్వతి ।

టీ.-సు-అతి ॥అ॥ ఈ౨ను, పూజనే = పూజార్థమందు వర్తించును, ॥ఉ॥ సుపన్థా అతిపన్థాశ్చ. Particles of praise and reverence.

దివాఽ(హ్ని)

టీ.—దివా॥ అ॥ ౧,అహ్నీతి=పగటియం దనునర్థమునందు వర్తించును, ॥ఉ॥ కేచిద్దివా తథారాత్రౌ ప్రాణిన స్తుల్యదృష్టయః. By day

(త్వథ) దోషా(చ) నక్తం(చ రజనా వితి)॥ ౪౧౭॥

టీ.—దోషా-నక్తమ్ ॥అ॥ ఈ౨ను, రజనౌఇతి=రాత్రియం దనునర్థమునందు వర్తించును, ॥ఉ॥ చోరా దోషా యయుః పథి; నక్తమాపాన భూమిషు. By night.

మూ॥ (తిర్యగర్థే) సాచి తిరో(ఽ) Crooked, bent; awry.

టీ.—సాచి-తిరః ॥అ॥ ఈ౨ను, తిర్యక్=అడ్డముగానను, అర్థే=అర్థమునందు వర్తించును, ॥ఉ॥ సాచిలోచనయుగం నమయన్తీ; తిరోఽఞ్చతి.

(ప్యథ సంబోధ నార్థకాః।

స్యుః) ప్యా డ్పా డజ్గ హే హై భో

టీ.—ప్యాట్ - పాట్ [పా] ఫాట్ - అజ్గ-హే-హై-భోః [పా] భో॥ అ॥ ఈ ౬ను, సంబోధనార్థకాః = సంబోధనార్థమునందు వర్తించును, ॥ఉ॥ ప్యాట్ పుత్ర పరసర్వదా; పాట్ప్రియే హ్యేహిమన్దిరమ్; ఫాట్సఖేఫలితశ్చ్యాతః; శ్రూయతామజ్గవామపి; హేవటోభైక్షమాహర; హైవృక్షకింకమ్పసే; భోస్సన్తద్వీపవర్తినోరాజాన శ్చేతయధ్వమ్; భోరావణో త్తిష్ఠ మమాగ్రతోయుధి. Vocative particles.

స్సమయానికషాహిరుక్॥

టీ.—సమయా - నికషా - హిరుక్ ॥అ॥ ఈ౩ను, సమీపార్థమునందు వర్తించును, ॥ఉ॥ సమయా పర్వతం నదీ; విలఙ్ఘ్యలఙ్కాం నికషా హనిష్యతి; పర్వతస్య హిరుఙ్నదీ; సమయా - నికషా-ఈ౨ను, మధ్యమునందు వర్తించునని కొందఱు. Near; midst.

మూ॥ (అతర్కి తే తు) సహసా

టీ.—సహసా॥అ॥౧,అతర్కితే = విచారింపక యనునర్థమునందు వర్తించును, ॥ఉ॥ సహసా విదధీత న క్రియామ్. Inconsiderately;suddenly.

(స్యాత్)పురః పురతోఽగ్రతః

టీ.—పురః-పురతః - అగ్రతః ॥అ॥ ఈ౩ను, ముందర ననునర్థమునందు వర్తించును, ॥ ఉ ॥ పురస్సఖీనా మనునీత లోచనే; నాసీరధూలి ధవ

లాః పురతః ప్రయాన్తి, ప్రత్యర్థినోఽగ్రతోలేఖ్యమ్. Before, in front.

స్వాహా (దేవ హవిర్దానే) శ్రౌషట్ వౌషట్ వషట్ స్వధా॥౨౮౯॥

టీ.—స్వాహా-శ్రౌషట్-వౌషట్-వషట్-స్వధా ॥అ॥ ఈ౫ను, దేవ=దేవతలకు, హవిః = హవిస్సుయొక్క, దానే=ఇచ్చుటయందు వర్తించును; ॥ఉ॥ అగ్నయేస్వాహా; అస్తుశ్రౌషట్; శిఖాయైవౌషట్, వషట్కరోతి, స్వధాపితృభ్యః. Invacations with the offerings made to the gods or manes.

మూ॥ కించి దీషన్మనా (గల్పే)

టీ.—కించిత్-ఈషత్-మనాక్ ॥అ॥ ఈ౩ను, అల్పే = ఇంచుకంతయనుటయందు వర్తించును, కొంచెమనుట, ॥ ఉ ॥ కించిత్కుఞ్చితమూర్ధజః; ఈషదుష్ణంపయః పిబ, మనాక్విహస్యసన్తుష్టః A little.

ప్రేత్యాముత్ర (భవాన్తరే)।

టీ.—ప్రేత్య-అముత్ర॥అ॥ఈ౨ను,భవాన్తరే=జన్మాంతరమునందువర్తించును, ॥ఉ॥ ప్రేత్య స్వర్గే మహీయతే; ఇహ చాముత్రచ ఫలం. In the next life

వ ద్వా యథా తథే వైవం(సామ్యే)

టీ.—వత్-వా-యథా-తథా-ఇవ-ఏవమ్॥అ॥ ఈ౬ను, సామ్యే = పోలికయందు వర్తించును, ॥ఉ॥ సోమవత్ప్రియదర్శనః; పుష్పేషుహ్యేర్లమ్బిత లోచకైర్వా; తస్యార్థస్య యథాఽఽధమ్; యథాచైత్రస్తథామైత్రః; ఇన్దుఃక్షీరనిధావివ, అగ్ని రేవం ద్విజో భస్మసాత్కుర్యాదవమానితః. As; like.

అహో హీ (చవిస్మయే)॥

టీ.—అహో-హీ ॥అ॥ ఈ౨ను, విస్మయే = ఆశ్చర్యమునందు వర్తించును, ॥ ఉ ॥ అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితౌ; హతవిధిలసితానాం హీ విచిత్రోవిపాకః. Ah! (indicating surprise.)

మూ॥ (మౌనేతు) తూష్ణీమ్ తూష్ణీకాం

టీ.—తూష్ణీమ్-తూష్ణీకామ్॥అ॥ ఈ౨ను, మౌనే=మౌనమునందువర్తించును, ॥ఉ॥ మునిస్తూష్ణీమాస్తే; జపన్నాస్తేమునిర్ధీమాం తూష్ణీకాం జలమధ్యగః, Silently.

సద్యస్సపది (తత్క్షణే) ।

•టీ.-సద్యః-సపది॥అ॥-ఈ౨ను, తత్క్షణే = అప్పుడను నర్థమునందువర్తించును, ॥ ఉ ॥ సద్యఃపతతిమాంసేన; సపది ప్రదహత్యుపేక్షితోఽగ్నిః. Instantly.

దిష్ట్యా సముపజోషం (చే త్యానన్దే)

టీ.-దిష్ట్యా-సముపజోషమ్॥అ॥ ఈ౨ను, ఆనన్దే = సంతోషమునందు వర్తించును, ॥ఉ॥ దిష్ట్యా త్వ మసి మేధావీ; సముపజోషం భవాన్ జయతి. కొందఱు, దిష్ట్యా-శమ్- ఉపజోషమ్- అని మూఁడుపేళ్లుగాఁజెప్పిరి, ॥ఉ॥ శబ్కరశ్శంకరోతునః; ఉపజోష మిహాస్యహే. Indication of joy.

ఽథాన్తరేఽన్తరా॥౪౭॥

మూ॥ అన్తరేణ (చ మధ్యే స్యుః)

టీ.-అన్తరే-అన్తరా-అన్తరేణ ॥అ॥ ఈ౩ను, మధ్యే = నడుమననుటయందు, స్యుః = వర్తించును, ॥ ఉ ॥ ఆవయోరన్తరేజాతాః; అన్తరా త్వాంచమాంచకమణ్డలుః; మృణాలసూత్రామల మన్తరేణ స్థితశ్చలచ్చామరయోర్ద్వయం సః, Between; amidst.

ప్రసహ్య (తు హఠార్థకమ్) ।

టీ.- ప్రసహ్య॥అ॥ ౧, హఠార్థకమ్ = బలాత్కారమునందు వర్తించును, ॥ఉ॥ ప్రసహ్య విత్తాని హరన్తి చోరాః. Forcibly; violently.

(యుక్తే ద్వే) సాంప్రతం స్థానే

టీ.-సాంప్రతమ్-స్థానే॥అ॥, ద్వే= ఈరెండును, యుక్తే = యుక్తమను నర్థమునందు వర్తించును, తగుననుట. ॥ఉ॥స్వయంఛేత్తుమసాంప్రతమ్;సంప్రత్యసాంప్రతంవక్తుము క్తేముసలపాణినా; స్థానేభవానేకనరాధిపస్సన్. Properly.

ఽభీక్ష్ణం శశ్వ (దనారతే)॥ ౪౨॥

టీ.-అభీక్ష్ణమ్-శశ్వత్ ॥అ॥ఈ౨ను, అనారతే = ఎల్లపుడునను నర్థమునందు వర్తించును, ॥ఉ॥ అభీక్ష్ణముష్ణైరపి తస్య సోష్మణః; శశ్వద్ధ్యాతి. Continually. Perpetually.

మూ॥ (అభావే) నహ్యనో నా(ఽపి)

టీ.-నహి-అ-నో-న॥ ఈ ౪ అవ్యయములును, అపిశబ్దమువలన, అన-అనునదియు, అభావే=లేదనుటయందును, కాదనుటయందును వర్తించును,

